
డా॥ కడిమిళ్ళ
త్యాగసింధువు

# త్యాగసింధువు

## (భీష్మ చరిత్ర)



## పద్యకావ్యం



భారతీపుత్ర

**డా॥ కడిమిళ్ళ వరప్రసాద్**

ద్విశతావధాని

డా॥ కడిమిళ్ళ వరప్రసాద ద్విశతావధాని
టేలర్ హైస్కూల్
నరసాపురం - 534 275
PH - School - 4594
Res - 4876

ప్రతులు - 500

ప్రతులకు

వడ్డి శ్యామసుందర్
8వ లైను, శాంతినగర్
ఏలూరు

ముఖ చిత్రం
'చిత్రాలయ' రాంబాబు, ఏలూరు

వెల రూ 25/-

ముద్రణ ఏలూరు ప్రింటర్స్, ఏలూరు - 2

TECHNICALITIES : **SRI. V. BANDA**

DTP BY
**KAHL ICS ELURU.**

# కృతిభర్త



శ్రీ కొరళ్ళ సత్యనారాయణమూర్తి (రాజు)

# కృతికర్త



డా॥ కడిమిళ్ళ వరప్రసాద్

ద్విశతావధాని

# కవి కల్పతరువులు



అవధాన భోజ

శ్రీ వడ్డి శ్యామసుందర్

శ్రీమతి సుజాత

# బ్రహ్మ బిందువు

కడిమిళ్లాన్వయ వార్ధిచంద్రముడ! రేఖామాత్రవిన్యాసమే
ర్పడ గాంగేయ కథా విధానమును కబ్బంబట్లు గావించు నీ
వడికిన్ మెచ్చెద మెచ్చుకుండుటెటులబ్బా! గోత్రసాజాత్య మి
బ్బడియున్ ముబ్బడియౌచు డెందమును నిస్వార్థమ్ము నుఱ్ఱూపంగన్

రెండే రోజులలో శతాధిక వచః శ్రీ మద్వధానంబులన్
పండింపించిన నీకు నీ త్రిశతికినై పద్దెన్మిదేరీతి బ
ట్టెం? డంబౌ జయసంఖ్యకున్ సరిగమిాటించెన్ జగన్మాత నీ
యండన్నిల్చిన భారతీజనని శేయ స్సుందరాకారతన్.

త్యాగశ్రీనిధి భీష్మ జీవితమునందాయాయి కోణంబులెం
తే గంభీరము లీవు చూచితివి గానీ కండ పట్టించును
ద్యోగంబేలనా చేయవైతి వమితాశూక్తుల్ పిసాళింప కా
వ్యాగంబుల్ చివురించునే రసఫలప్రాప్తుల్ ప్రసాదించునే.

స్వాంతర్ఘర్షణ లాత్మదూషణలు పశ్చాత్తాపముల్ మోహవి
భ్రాంతుల్ నిందలు - జీవితం బగతి సంగ్రామంబుగా సాగియే
సంతృప్తుల్ గనలేక పైవరములే శాపంబులై కాల్ప నే
కాంతంబందలి తత్త్వగీతిక కదా గాంగేయుండూహించినన్!

నిలకడ వలయును కృతికని
పలికిన ఆసామి పాద పద్మములెపుడున్
తలచుక మ్రొక్కదే. కృతులన్
బలుకక నక్కెడ - ప్రసాద పండిత సుకవీ!

- ఆచార్య బేతవోలు రామబ్రహ్మం

21-7-97

వి. గోపాలకృష్ణ శాస్త్రి
ప్రిన్సిపాల్
శ్రీ గౌతమి విద్యా పీఠం
రాజమండ్రి - 533 105

29-7-97

శివాయ గురవేనమః

# హిత తరఙ్గము

'భారతీ పుత్ర' శ్రీ కడిమిళ్ల వరప్రసాద ద్విశతావధాని వ్రాసిన 'త్యాగసింధువు' కావ్యము నామూలచూడముగ నవలోకించితిని. త్యాగమే నిష్క్రియాత్మ స్వరూపావస్థాన లక్షణమగుముక్తికి సాధనము. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే న అమృతత్వమానశుః" అనుశ్రుతి అమృతత్వప్రాప్తి ప్రజా ధన కర్మాదుల వలన కలుగదని వక్కాణించుచున్నది. సర్వకర్మఫలత్యాగమే త్యాగశబ్దార్థమని భగవద్గీతాస్మృతి విశదపరచుచున్నది. "సర్వ కర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః" "త్యాగ వ్రతాచరణా మోఘయశోవిలాసి (304) యగు శ్రీ భీష్మాచార్యుల దివ్యగాధను సరలసుందరముగ కవి ఈ కావ్యమున నిబంధించినారు.

ఈ లఘుకావ్యమునందు ఆరు ప్రకరణములలో 308పద్యములు గలవు. సర్వప్రాణిసాధారణమగు షడ్భావవికారములకు సంకేతముగ 'జననము' మొదలు'అంపశయ్య' వరకు ఆరు ప్రకరణములుగా విభజింపబడుట యుక్తము. కావ్యములు కాంతాసమ్మితముగ ఉపదేశములు గావించుచుండును. త్యాగ వైభవము నుపదేశించెడి ఈ కావ్యమునందు అచటనచట పాయసమునందు జీడిపప్పువోలె శాస్త్రీయ సిద్ధాంతములు పొందుపరచబడినవి.

ప్రాణికోటి అజ్ఞాన ప్రయుక్తములగు రాగ ద్వేషములకులోనయి, పుణ్య పాపకర్మల నాచరించుచు తదనుసారి జన్మలను బొంది దుఃఖముననుభవించుచుందురు. కాగా సాంసారిక దుఃఖజాతమునకు అజ్ఞానప్రభావములగు రాగద్వేషములే కారణములని తెలుచున్నది. దుఃఖ నివృత్తి గోరుమానవుడు ఈ రాగద్వేషములను దూరము చేసికొనవలయును. ఈ రహస్యము "రాగము ద్వేషము దూరము చేసి పరాత్పర! మోక్షమొసంగ గదే!" (280) అను పద్యములో సుబోధముగ వర్ణింపబడినది.

పాండురాజును సోమయాజిగ, బుద్ధిశక్తి యగ్నిగ ప్రజకు మంచిసేత పరమఫలముగ వర్ణించుటలో కవికిగల మీమాంసాశాస్త్ర పరిచయము స్ఫుటమగుచున్నది. (212)

"ద్రవ్యనవకమందొకటియై తనరుచుండుకాలమని తర్కవిదులు పల్కంగవచ్చు" (77) అనుచోట తర్క శాస్త్రమునందు ద్రవ్యములు తొమ్మిదిగ విభజించుటను స్పృశించుచు, కాలలీలావిభూతులకు దగిన హేతువుచూపు తార్కికుడు లేడని చెప్పుట కాలమీశ్వర స్వరూపముగావున ఈశ్వర లీలా విభూతి ఎవరికి తెలియును? అను అభిప్రాయము గలది.

'ప్రారబ్ధమాపదరమె'

*'అంతిమకాలమ్మున తనవంతై నిలుచునది కర్మఫలమొక్కటియే' (135)*

*'కర్మపరిపాక మన్యధాకరణమగునె' (158)*

*'సత్యమొక్కటియే గదా శాశ్వతమ్ము' (236)*

*' ధర్మమొక్కటియే గదా దైవతమ్ము. (236)*

మున్నగు ఉపదేశవాక్యములీ కావ్యమునందసంఖ్యాకములు.

"యాగము నా బ్రతుకంతయు దత్ఫలమంతము నీయది గైకొనుమా!" (280) అను భీష్మవాక్యముచే సర్వకర్మఫలత్యాగలక్షణమావిష్కరింపబడినది. "త్యాగశీలుండు భీష్మపితామహుండె, త్యాగజీవమునకు నాదర్శమతడే"(17).

ఇట్టి సత్కావ్యములు సమాజమునకత్యంతోపాదేయములు. సంస్తుతిపాత్రమయిన ఈ కావ్యమునకు ప్రేరకులగు ఆస్తికులు, ఉదారులునగు శ్రీ వడ్డి శ్యామసుందరరావుగారు ధన్యులు - అభినందనీయులు. భారతీకటాక్షపాత్రులగు శ్రీ కడిమిళ్ల కవి ఇతోధికముగ సకలాభ్యుదయములు పొందునట్లు సర్వమంగళాజానియగు సర్వేశ్వరుడు అనుగ్రహించుగాత

*- శివం భూయాత్.*

- విశ్వనాధ గోపాలకృష్ణశాస్త్రి.

# అవగాహనం

ఈశ(శ్రీ)శావృక్ష పక్షీంద్రవాహౌ
ప్రావృడ్వార్యుచ్ఛారదాంభోదదేహౌ
పాతాం సర్వైశ్వర్య సంపత్ సమృద్ధిం
దత్వా తత్త్వార్థావ బోధంచ భక్తాన్

వనం, కవనం, భువనం (జలం) అన్నవి తేవనం, భావనం, ధావనం, అనువాని వల్లకంటె 'అవగాహనం' అనునొకదాని వల్లనే సుగమాలౌతాయి.

అయితే అది అందరికీ అందుబాటు కాదేమో! వీటిల్లో రెండోది మరీ. మరీ గహనం, అగమ్యం. తదవగాహనానికి కొంత అధికారం (అర్హత) ఉండాలి. అందుకే భాస్కరాచార్యులు తన సిద్ధాంతశిరోమణిలో 'తదవగమననిష్ఠః, శబ్దశాస్త్రే పటిష్ఠః అంటూ 'అవగమనం (Understanding capacity), శబ్దశాస్త్ర (వ్యాకరణ) పాటిష్ఠ్యం అవసరం' అని సూచించాడు. ఇది విషయాంతరం.

ఒక కృతిని సమీక్షించేటప్పుడు సమీక్షకుడు ముందుగా అవగాహన సామర్థ్యం కలవాడై ఉండాలి. రాగద్వేషాలుండరాదు. నిష్పక్షపాతదృష్టి కల్గియుండాలి. విమర్శ లేక సమీక్ష విషయైక నిష్ఠమై ఉండాలి కాని, వైయక్తికం కారాదు. మరి ఆ లక్షణాలు నాలో ఉన్నాయో లేదో కాని సమీక్షకు సాహసిస్తున్నాను.

'త్యాగసింధువు' అని కావ్యానికి పేరు పెట్టుటలోనే వైలక్షణ్యం ఉంది. వివేక సింధువు (కొండనార్య ప్రణీత వేదాంత కావ్యం) , నిర్ణయ, ధర్మ, భక్తిరసామృత సింధువులు (వరుసగా కమలాకర భట్ట కాశీనాథోపాధ్యాయ, రూపగోస్వామి ప్రణీతాలైన శాస్త్ర నిబంధన ప్రబంధాలు) విబుధులకపరిచితాలు కావు. కాని ఇది ఆ గ్రంధాలవంటిది కాదు. ఇది ఒక మహాపురుషుని నామధేయంగా కల్పించబడిన కావ్య నామధేయం. ఇందు త్యాగసింధువు భీష్ముడు. తత్త్యాగవైభవ మపారం. కావుననే సింధూపమానం . కావ్యారంభం సంప్రదాయబద్ధంగా, శ్రీ కారాదిగా, వర్ణగణాదిశుద్ధిమంతం, అభ్యుచ్ఛ్రయదాయకంగా సాగింది. ఇందువస్తువిన్యాసం రూపకాలంకార శోభితం.

మూడుంబాతిక ($3\frac{1}{4}$) పాదాలు, దీర్ఘసమాసభాసురాలై, గంభీర భావశోభితాలై,'పద్యం' అంటే భగ్గున మండిపడే కిగ్గాడి మూకకు మూకీ భావాపాదకాలై, రసిక సారంగాలకు తనివిగూర్చు నవకుసుమాలుగా నిలిచాయి.

తర్వాతి తొమ్మిది కవి-కుటుంబౌన్నత్యం, గురుస్తవం. తక్కినవి- కృతిపతి ప్రశంస, కవికల్పతరు ప్రస్తావన రచనౌత్కంఠ్యాన్ని ప్రతిపాదిస్తున్నాయి. 13 వ పద్యంలోని 'ఎఱిగి-యెఱిగి' అను ప్రయోగం ఎఱ్ఱనగారిని తలపిస్తోంది.

ఈ కావ్యంలో 'జననం, ప్రతిన, గురుసమరం, వంశం, సంగ్రామం, అంపశయ్య' అని ఆరు విభాగాలున్నాయి. అమాంబాపతు కావ్యం అంతా 308 పద్యాలు, 22 కృత్యాది పద్యాలు మొత్తం 320 ఉన్నాయి.

(I.O11-56; II 57-128; III 129-198; IV 199-215; V 216-278; VI 279-308) వెరసి 56+72+70+17+63+30=308 రచయిత ఈ కృతిని కేవలం 18 రోజుల్లో వ్రాసినట్లు ఈ గ్రంథాంత గద్యంలో స్పష్టంగానే ఉట్టంకించారు. కూచిమంచి తిమ్మకవి శివలీలా విలాసాన్ని (రెండు ఆశ్వాసాల భక్తికావ్యం) 32 రోజులలో వ్రాసానని చెప్పుకొన్నారు. చురుకుగా వ్రాయుట Demeritకాదు. దీర్ఘసూత్రిగా వ్రాస్తూ తూనాబొడ్డు అంటూ కూర్చోవడం ఒకMeritకాదు. బాగోగులకు జాగు-వేగం తూకం కాదు.

'జననం' అను ఖండిక యందలి ఆరంభపద్యం నైకామోఘ తపోధనాశ్రయము.తల్లోకమే' అన్నది. సత్యలోక వర్ణనమని చెప్పకచెప్పుచున్నది. ఇదే చాతుర్యం. 23వ పద్యం 'కలయో! నిక్కమొ! నిద్రయో! మెలకువో!" అన్నది పోతనగారి కలయో! వైష్ణవమాయయో' ........... అన్నదాని పుత్రికయో! ఉత్తర రామచరితంలో భవభూతి చెప్పిన

'వినిశ్చేతుంశక్యోనసుఖమితివా దుఃఖమితివా

ప్రమోహో నిద్రావా కిమువిషవిసర్పః కిముమధః'...... అను దాని పౌత్రియో ! 32,37,274 పద్యాలు ' అని పలుకాడు' అనే ఎత్తుగడతో ప్రారంభమయ్యాయి. ఆ ప్రయోగం ఈ కవికి ఇష్టమేమో! 45వ పద్యంలోని ' ఉన్మత్త శృంగార వాంఛ' అన్న పదబంధం విలువ కట్టలేనిది. 51లో 'బిడ్డ యేడుపు ప్రణవమ్ము వినిచినట్లు ' అనుటయు అపూర్వ ప్రయోగమే.47లో అచ్చట్లు-ముచ్చట్లు 58లో ఏండ్లు పూండ్లు సమయోచిత పదవిన్యాస విలాసము. 58లోనే 'వెంటాడు' అనుక్రియాపదం ఘుణాక్షరాయితం కాక ఈ కవి 'వేట'కు వెంట అన్నమాట యున్నట్లు తెలిసియే

ప్రయోగించెనని ఘంటా పథంగా చెప్పకతప్పదు. (వేట-వెంట-పేడ-పెండ మొదలైనవి) 'రేలమృతాంశులో శశము రెమ్మద- మంచుదలంచి. వెంట యింటి కుందేలిది యెందు బోగలదు.' అని విజయ విలాసంలోని చామకూరపాకం. ' తెలియని దద్దమ్మలు 'వంటయింటి' అని దిద్దేశారు. అని సమగాంధ్ర సాహిత్యచరిత్రలో ఆరుద్ర అట్లకాడ కాల్చి అంటిచారు. ఇట్టిదేదో పేడ పెండ. కొఱవి గోపరాజుసింహాసన ద్వాత్రింశికలో 'పెండయెత్తెడునట్టిముండకిచ్చె' అని ప్రాస ఘటితంగా ప్రయోగించాడు. ఇది సుప్రీంకోర్టు తీర్పులాంటిది. దీనికి అప్పీలు లేదు. సరే! నా కల్పం నా కలం దూకుడు జోరయింది. ముకుతాడు లాగి, ముందు దారికి తెస్తా.

77లో ద్రవ్యనవకమందొకటియై......కాలమని తర్కవిదుల పల్కంగవచ్చు' అనుట కవికి గల తర్కశాస్త్ర పరిచయం స్పష్టీకరింపబడుతోంది. ఇందే 'లీలా విభూతి' అన్నమాట కూడా భగవానుని కున్న విభూతి త్రయం (T.C నిత్య విభూతి. లీలా విభూతి, త్రిపాద్విభూతి) అంటే ఏమిటో ఈయనకు తల స్పర్శిగా తెలిసియే ఉన్నట్లు ద్యోతకం కాక మానదు. 82 లో 'పుడమి గుబ్బెత' అనకుండా పుడమి పడతియు అంటే లెస్సయేమో! ఇది అమర్చిన దాంట్లో అత్తగారు వ్రేలు పెట్టినట్లే అనియు అనుకోవలసియున్నది. 83వ పద్యం చక్కని జాణతనం, అందం, కలికితనం, కాంతిమేళవించిన మేలి రవణం. 84లో పడవనడుపు పడతి యొడుపుల తీరు కవి గడుసుతనాన్ని ప్రకటిస్తోంది. 87లో భాసుని శ్లోకాన్ని స్వీకరించుటలో ఈ కవికి మహామహులపై, వారి రచనలపై ఎట్టి భక్తి గౌరవములున్నవో వ్యక్తంకాక మానదు. ఇది చక్కని ఆదర్శం గదా! 89వ కందంలోని అందం అనన్యసాదృశ్యం. 116లో ఈ కవి 'శాంతనవనిష్ఠ'అనుటలో ఆంతర్యమేమిటో! శాంతము, నవము (నూతనము) అగు నిష్ఠ అని కాదు గదా! ఇదియే ద్విశతావధానుల కడు గడుసుదనపు పోకడ.

'అనేకామోఘ' అనుటకు 'మైకామోఘ' అనియు 'అనిదంపూర్వ' అనుటకు'నైదంపూర్వ'అనుటయు ప్రౌఢ ప్రయత్నమే. 125లో 'రోదన మిగిలెన్' అన్నారు. ఇది చరితాదులలో ఇముడుతుందా? చూడాలి మఱి. 133లోని దొక వైరాగ్యధోరణి. మంచిదే. 132 కూడా అంతే. 219,139 లలో ఉసురు, అసువు అనుట కంటే'లు' చేర్చుటం లెస్స. ఇవి రెండు నిత్య బహువచనాంతాలుగా మఱి. 157లో అతగాని సొత్తవై అనడం స్వతంత్రతయే. 163లో "గురునకు కన్నులనుండి కప్పురపునీరు వెడలెనట" క్రొత్తదనం. 189లో 'బీజము భూజమున్ దినుటయై' ఈ ప్రయోగం గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించుట వంటిదే. సత్తాగల వాక్యం.

212లో పాండురాజు రాజ్యపాలన వర్ణనం రూపకాలంకారశోభితం. భీష్మనైరాశ్యవైరాగ్యాలలో మహామహుని త్యాగమూర్తిత్వం ద్యోతకమవుతుంది.

ఇట్లెన్నెని ఉదాహరణలను చూపవచ్చును. కాని చద్దికంటే ఊరగాయ ఎక్కువ అవుతుంది. వడ్డించే ముందు వాచవి ఎందుకు? కావ్యమంతా చేతిలో పెట్టిన తరువాత ఒక్కొక్కటే మచ్చుచూపడం అనావశ్యకం గదా! చదువరులే స్వయంగా ఆమూలాగ్రం చదివి గ్రహిస్తారు. అది చదువరులకే వదిలేసి, నాలాంటి మీడియేటర్ ఇమ్మీడియట్‌గా తప్పుకోవడం వారికి కూడా ఆసక్తినీ, ఆలోచననూ కల్పించటం, వారి ఆనందానికి దోహదం చేయడం సర్వశ్రేయం. చివరిగా చిన్న ప్రతిస్పందనం.

1. వడిగలతనంబు కడుమేల్
నడకల యొడుపులును, వాడి, లాలిత్యంబున్
తడబడని భావ సంపద
కడిమిళ్ళ కవిత్వమందు గడుసరి సొగసుల్

2 ఉత్తమ కవితా రీతులు
సత్తములగు వారి సత్తసౌజన్యంబున్
జిత్తమున హత్తుకొనియెద
అత్తిలి గోపాలకృష్ణమాచార్యుండన్

3. కడ వెళ్ళన్ జదివింపజేయుగద మీకబ్బంపు విన్నాణముల్
గుడధానాయితముల్, దురన్వయ తతుల్, దూరాన్వయంబుల్ గనం
బడవెప్పట్టుననైన, దిట్టవగుదో భారత్యపత్యప్రధా!
కడిమిళ్ళాన్వయ రత్నదీప! మదినాకాంక్షింతు ద్వచ్ఛ్రేయమున్.

ఇట్లు
విబుధ విధేయుడు

27-7-97
నరసాపురం

అత్తిలి గోపాల కృష్ణమాచార్య
నామవిధేయుడు, నరసాపుర వాస్తవ్యుడు.
ఈశ్వరాషాఢకృష్ణాష్టమీ భానువాసరం.

# మా అల్లుడు

పిల్లనిచ్చే వాడెవడైనా ముందుగా అల్లుడి యోగ్యత గురించే ఆలోచిస్తాడు. శ్రీ కొరళ్ళ సత్యనారాయణ మూర్తి (రాజు) చూడ ముచ్చటయిన రూపం కలవాడు, విన ముచ్చటయిన వాక్కు గలవాడు. చక్కగా చదువుకొన్నాడు. రెట్టింపు వినయాన్ని సంపాదించుకొన్నాడు. శ్రమ శిక్షణకు మారు పేరు. ధనమంటారా! ఛాయా చిత్ర వ్యాపారంలో ఒక్కొక్క మెట్టుగా పైకి ఎదగడమే కాని, ఒక చోట ఆగే పద్ధతి లేదు. ఆయన క్యాపిటల్ స్టూడియో ఎప్పుడు చూసినా జనాలతో కిటకిట లాడుతూనే ఉంటుంది. కానీ గమ్మత్తు అంతటి వ్యాపార వ్యగ్రతలోనూ మోమున అరనవ్వు చెదరదు. పొరబాటు దొర్లదు. తారతమ్యం లేకుండా వచ్చిన ప్రతీ వారినీ గౌరవించడంలో ఏమరు పాటుండదు. వ్యసనముల సంగతే తెలియదు.

ఛాయా చిత్ర కళా నైపుణ్యం విషయానికి వస్తే దండ మళ్ళీ వేయడం, సూత్రం ఒకసారి పట్టకోండి, మొగమిటు త్రిప్పండిలాంటి మాటలుండవు. వారి పనిలో వారుంటే తన పని తాను చేసుకొంటూ పోతూ, చివరకు ఫోటోలు చేతికి ఇచ్చేటప్పటికి వాహ్! అని ఆశ్చర్యపోవలసిందే. జీవం తొణికిసలాడుతుంటాయి.

ఫోటోలతో మొగం మొత్తే ప్రముఖ కవి బేతవోలు రామబ్రహ్మం గారంతటి వారు రాజుగారూ! మీ చేత ఫోటో తీయించుకోవాలనుందని అడిగి మరీ ఫోటో దిగుట, ఐహికమునకు దూరంగా వున్న శ్రీ లక్ష్మణ యతీంద్రులంతటి వారు రాజుగారు యాదృచ్ఛికంగా తీసిన ఫోటోనే నిలువెత్తు చేయించి, ఆశ్రమంలో (పెదముత్తేవి) ఉంచుకొనుట, ఒక సభలో యాధాలాపంగా తీసిన ఫోటోను ప్రముఖ సంస్కృత శతావధాని శ్రీ చెరువు సత్యనారాయణ శాస్త్రి వారింట్లో ప్రధానంగా అమర్చుకొనుట ఇటువంటి ఉదాహరణలు ఎన్నో - ఎన్నెన్నో రాజుగారి ఫోటో గ్రఫీ నైపుణ్యానికి అద్దం పడుతున్నాయి. అన్నీ బాగానే ఉన్నాయి. మఱి వంశ మర్యాదో! ముత్తాత శ్రీ బసవరాజు వాణిజ్య సంబంధంగా రంగూన్‌లో ఉన్నప్పుడు ఏదో సందర్భంలో మిత్రబృందం ఫోటో తీయించుకొనే సమయంలో సరదాగా ఆ కెమోరాను పరిశీలిస్తుంటే 'ఇది నీకేం తెలీదులే' అని కసురుకొన్నాడట ఆ ఫోటో గ్రాఫర్ అంతే! పౌరుషం వచ్చి, ఆ విద్య మొత్తం సాధించి కాకినాడ, విజయనగరాలలో ఫోటో గ్రాఫర్ వృత్తినే ప్రారంభించిన దీక్షాపరుడు. తాత శ్రీ సి.జె. రావు తండ్రి బాటలోనే పయనిస్తూ నరసాపురంలో ఆ పరిసర ప్రాంతాలకే మొదటి ఫోటో స్టూడియోను ప్రారంభించడమే కాక ఉచితంగా హోమియో వైద్యము, ఔషధ వితరణము కూడా చేసిన దయాశీలి.

తండ్రి శ్రీ వరదరాజు కూడా కొరళ్ళ వారికి దత్తుడైనా, తన తండ్రి వృత్తినే స్వీకరించి, మిలట్రీ ఫోటో గ్రాఫర్‌గా ఉద్యోగం చేసి, రెండవ ప్రపంచ యుద్ధంలో అధికారుల ప్రశంసలందుకొని, తిరిగి నరసాపురం వచ్చి, ఫోటో స్టూడియోను అభివృద్ధి చేస్తూ పట్టణంలో మొదటి ఫోటో స్టాట్ (జీరాక్స్)ను ఏర్పరిచారు. అన్నయ్య శ్రీ జగ్గారావు శ్రీ కాకుళం జిల్లాలోనే మొదటి జీరాక్స్ వ్యవస్థాపకులు. తమ్ముడు శ్రీ రామకృష్ణ వైజాగ్

స్టీల్‌ప్లాంట్‌లో ఇంజనీరుగా చేస్తున్నారు. మరొక తమ్ముడు శ్రీ బదరీనాథ్ నరసాపురంలోనే ఉంటూ ఫోటోగ్రఫీలోను, జీరాక్స్‌లోను, అన్నగారికి చేదోడు-వాదోడుగా ఉంటూ, కళా నైపుణ్యంలోను, వ్యక్తిత్వంలోను కూడా అన్ని విధాల అన్నగారికి సాటియై నిలుస్తూ క్యాపిటల్ స్టూడియో పట్టణానికే మకుటాయమానమయ్యేలా తీర్చి దిద్దారు. పైగా వారి సోదర సంబంధం అలనాటి రామలక్ష్మణులను తలపిస్తుంది. తల్లి శ్రీమతి రత్నమాల కూడా గృహకృత్యాలే గాక, ఫోటోగ్రఫీ కూడా నేర్చుకొని, భర్తకు వ్యాపార సంబంధమైన చేదోడు కూడా ఇచ్చిన సహధర్మచారిణి. రత్నాల వంటి బిడ్డలను గన్న శ్రీమతి రత్నమాల నిజంగా ధన్యమాత.
అందుకని, రూప ధనశీల కళా విద్యా వంశ మర్యాదలతో ఉన్నతుడే గాక, నాకు మంచి స్నేహితుడు కూడా అయిన శ్రీ కొరళ్ళ సత్యనారాయణకు (రాజు) నా కృతి కన్యను అంకితం చేసి, కృతార్థుడనవుతున్నాను.

## వర ప్రవర

1. ఆ విజ్ఞానమొ! సత్కలాపటిమయో! వ్యాపార వైదుష్యమో!
ఆ వైద్యమ్మునకౌషధమ్ములకు ద్రవ్యాపేక్ష లేకుండుటో!
ఏవేవో కలవిట్టి లక్షణములెన్నెన్నో! యొకే మాటలో
సేవా రంగధురంధరుండతడు సి.కె. రావు సామాన్యుడా!

2. లేవం జూపి పరిక్రమించుచు, మిలట్రీలో ఫోటో గ్రాఫరై
ప్రావీణ్యమ్మును, సేవనాభిరతియున్ వాణిజ్యముందుంచి, య
య్యా వైదుష్యములందు దండ్రికిని దీటై, మెప్పులంగాంచి, యెం
దే వేనోళ్ళను నానె నా వరద రాజింకెంత సమ్మాన్యుడో!

3. ఆలు సహధర్మచారిణి యన్నమాట
వరద రాజునిల్లాలి జీవనమునందు
సత్యమైనది. వృత్తికిన్ సాయపడుచు
రత్నమాల నిల్చెను బతివ్రతయనంగ

4. అట్టి తల్లిదండ్రులకు బుణ్యాల పంట
విద్యనార్జించి, తగిన వివేకమంది,
కళను బ్రేమించి, సాధించి, ఘనతనంటె
నాప్తహితుడైన సత్యనారాయణుండు

- కడిమిళ్ళ

# గుండెకు నోరుంటే......

ఇలా అంటుంది. " ఈ రోజుల్లో కవిత్వం ఎవరికి కావాలి. ఒకవేళ ఆనందించే హృదయం వున్నా పోషించే ఔదార్యం ఎంత మందికి ఉంటుంది". 'ఎవరైనా శతావధానం చేస్తారా ! చేయించేందుకు నేనున్నా' అని పలికే సత్తా ఎవరికి ఉంటుంది. సహస్రావధానం చేస్తే పాతికవేలు పారితోషికం ప్రకటించి అమలు పరిచే ఎముకలేని చేయి ఎక్కడ ఉంటుంది. ఎవరైనా మంచి కావ్యం వ్రాస్తే పదివేలిస్తాననే పిపాస మచ్చుకైనా కనిపిస్తుందా! ఇన్నింటిలో ఏ ఒక్క లక్షణం పట్టినా వానిని ఉదారుడు అనాలి. అన్ని ఒక్కరిలోనే వుంటే......... ' కవి కల్పతరువు' అనాలా? అవధానభోజుడు అనాలా! ఊహూ......... మాటలకందని భావాలను మంచి మనసులకే విడిచిపెడుతున్నాను. ఇంతకూ ఆ అమృత హృదయుడు శ్రీ వడ్డి శ్యామసుందర్. వారి ఇల్లాలు శ్రీమతి సుజాత

*' భవంత్యవ్యభిచారిణ్యః '*

*భర్తరిష్టే పతివ్రతాః* అను కాళిదాస వాక్యానికి ప్రత్యక్ష ఉదాహరణ. కవితా పిపాసలో వారి కుమార్తె లిరువురూ కూడా తండ్రితో పోటీ పడతారు. భర్తకు తగిన భార్య, దంపతులకు తగిన పిల్లలు. ఈ కూడిక అదృష్టవంతులకు దక్క దక్కేది కాదు.

కావ్యం వ్రాయమన్నారు. వ్రాసేవరకు తొందర పెట్టారు. వ్రాసాకా ముద్రణకు వీలుగా తయారు చేసి ఇచ్చేదాక తొందర పెట్టారు. ఇవ్వగానే వారి ఊరిలోనే(ఏలూరు) స్వల్పకాలంలోనే ఇదిగో! ఇలా........ ముచ్చటైన రూపాన్ని సంతరించారు. ముద్రణ సంబంధి వ్యయమే కాదు, ప్రయాస కూడా వారే పడ్డారు. వారికి నేను ఎలా కృతజ్ఞతలు చెప్పగలను. చెప్పడం నా వల్ల కాదు. కనుక ఆ వాత్సల్యామృతాన్ని నామేనునిండా నింపుకుంటాను. ఈవికి కావలసింది సిరిసంపదలు కావు. పిడికెడు గుండె, అందులో చిటికెడు స్పందన, దానికి రవ్వంత రసజ్ఞత ఈ మూడూ కలిసిన మోహన రూపాన్ని చూసి, కీర్తికాంత

'శ్యామసుందరా!నీపై మోజు తీరలేదురా' అని అనుకోకుండా ఉండగలదా"

అని అంటుంది. కానీ పాపం నోరు లేదుగా! అందుకని అనలేక అనుకుంటోంది.

- కడిమిళ్ళ

12-5-97

# కృతజ్ఞతా తరంగం

*ఒక కావ్యాన్ని వెలువరించినపుడు పొగడ్తలే లభిస్తాయో ! తెగడ్తలే దొరుకుతాయో! ఏదైనా నాకు వరప్రసాదమే.*

'నిందతు. నందతు వాసన్
అసూయురనసూయురత్రకింతేన
యత్ సన్మానస గమనా
యైవేదం మమతు పాథేయమ్'

ఈ కావ్యవ్యయమున కోర్చిన సౌజన్యమూర్తి,
కవికల్పతరువు, అవధాన భోజ
శ్రీ వడ్డిశ్యామసుందరరావు,
ప్రయాసకోర్చిన సహృదయతాధని శ్రీ వి. బందా
కృతిని స్వీకరించిన స్నేహశీలి, ఆత్మాభిన్నుడు
శ్రీ కొరళ్ళ సత్యనారాయణ మూర్తి (రాజు)
తెక్కలు ముక్కలయ్యేలా వ్రాసి పెట్టిన
గురుభక్తి పరతంత్రులు
శ్రీమతి కె. సత్య, శ్రీమతి సి, రుక్మిణి, శ్రీ జి. శ్రీనివాస్.
అడిగిన తక్షణంబభిప్రాయములను ఆశీస్సులతో మిళాయించి, అందించిన

| | |
|---|---|
| సరస్వతీ కంఠాభరణులు | డా॥ ప్రసాదరాయకులపతి |
| కనిపించే సరస్వతి | శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ |
| నడిచే గ్రంథాలయం | శ్రీమాన్ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు |
| సంచాలక సార్వభౌములు | డా॥ బేతవోలు రామబ్రహ్మం |
| ప్రథమ సహస్రావధాని | డా॥ మేడసాని మోహన్ |
| మహాసహస్రావధాని | డా॥ మాడుగుల నాగఫణిశర్మ |
| ప్రామాణిక ఉభయ భాషావధాని | డా॥ చిఱ్ఱావూరి శ్రీరామశర్మ |
| కవితా పాండితీ సంపన్నులు | డా॥ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ |
| కవితావధాన విశారదులు | డా॥ కేసాప్రెగడ సత్యనారాయణ |

ముచ్చటగా ముద్రించిన ఏలూరు ప్రింటర్స్ వారికి,

ముఖచిత్రాన్ని పొందుపరచిన చిత్రాలయ రాంబాబు గారికి

వీరందరికీ సర్వదా -సర్వధా కృతజ్ఞుడను - కడిమిళ్ళ

కడిమిళ్ళ రచన కమనీయంగా రమణీయంగా ఉంది

- డా॥ ప్రసాదరాయ కులపతి, గుంటూరు.

అత్మీయ సోదరుడు కడిమిళ్ళ వరప్రసాద్ ఏ వాక్యం చెప్పినా ' వాక్యం రసాత్మకం కావ్యం' అనే ఆలంకారిక సూక్తికి ఉదాహరణంగా గ్రహించవచ్చు.

డా ॥ మేడసాని మోహన్, తిరుపతి

సూటిగా ధాటిగా సుస్పష్టమై నిల్చు కడిమిళ్ళ పద్యంబు ఘనరసంబు

డా ॥ మాడుగుల నాగఫణిశర్మ, హైదరాబాదు

కడిమిళ్ళ పద్యం గౌరవాన్ని తగ్గించదు

డా॥ చిఱ్ఱావూరి శ్రీరామశర్మ , రాజమండ్రి

కడిమి గలదియె కడిమిళ్ళ కవితయెల్ల

డా ॥ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ, రాజమండ్రి

కడిమిళ్ళ వారి పద్యాలు గోరువెచ్చని పాలు మాగడల రుచుల నోరూరిస్తూ కమ్మదనాన్ని అందిస్తాయి.

డా ॥ కేసా ప్రెగడ సత్యనారాయణ , కిర్లంపూడి.

అడుగగనే పద్యమ్మా
నడుగిడుచో పద్య పాదమడుగిడినట్లే
జడియని కవితాసింధువు
కడిగిన ముత్యమ్మ కాదె కడిమిళ్ళయనన్

మహాసహస్రావధాని
డా॥ గరికపాటి నరసింహారావు, కాకినాడ

# అంకితం

1. ఏ యెడనే నెప్పుడో జరుగునే శుభ కార్యములందునైన నీ
వే యగుపట్టుచుందువటులే కర పద్మమునందునన్ కెమే
రా యొకటుండు దానికి విలాసము లెల్ల కొరళ్ళ సత్యనా
రాయణ! యెట్లు నేర్పితివిరా! భళిరా! భళిరా! చమత్కృతుల్

2. ప్రాయమునందు బిన్నవట బాపురె! చిత్ర కళా విశేష వి
ద్యాయుత మేధయందున బురమ్మున గల్గు జనాళి గుండెలం
దే యిలు గట్టుకొంటివట! యెంతటి నేర్పు కొరళ్ళ సత్యనా
రాయణ! నిన్ను బోల గలరా! కల చిత్ర కళావిదుల్ పరుల్

3. మాయిలు చేరవచ్చునభిమానుల గుండెలు గోడ లెక్క. యౌ
రా! యని మెచ్చుకొన్నపుడు ప్రాణయుతమ్ముగ దోచుచుండె, బొ
మ్మా! యిది తీసిరెవ్వరని మాటికి నన్ను కొరళ్ళ సత్యనా
రాయణ! ప్రశ్న వేసిన రవంత యసూయ జనింపకుండునే

4. ఇంతటి వాడవయ్యు. వినయేందిర నిన్నుగవుంగిలించుటే
వింత గదోయి! పెద్దలను విజ్ఞత తోడ నమస్కరించు నీ
యంతటి వాడు ప్రాణ హితుడౌటయు నాకొక భాగ్యమే యవి
శ్రాంత కృషీవలా! వరద రాజమనోం బుధి రత్నదీపమా!

5. ఆ యల్లాసమునా చమత్కృతియునయ్యానంద రేఖా కళా
మ్నాయమ్మౌ దరహాస పారణము నన్నా! నీ కెమేరాకు నీ
వేయే రీతుల బోధ సేసితివొ! గానీ, నిక్కముంబల్కెదన్
ఛాయా చిత్రము నీవె తీయవలె రాజా!పెద్దలౌనౌననన్.

6. మాయూహమ్ములు నిక్కమంట గవిరామ బ్రహ్మమో! మౌని వి
ద్యా యోగమ్మున కొజ్జ లక్ష్మణయతీంద్ర స్వామియో! నేతలో!
ఆయా వ్యక్తులో! సాక్షులైనిలువరో! యవ్యాజమైత్రీ ప్రియా!
ఛాయా చిత్రము నీవె తీయవలె రాజా! పెద్దలౌననన్.

7. నీ కంకితమిచ్చుటచే
నా కృతి కన్యకకు గ్రొత నవనవలంటెన్
ఈ కన్య త్యాగ సింధువు
నీ కుందగుజోడు, జోడు నీవే రాజా!

8. నా కన్య వలన నీవును
నీ కారణముననె కృతియు నిచ్చలు గవితా
లోకమ్మున రసజీవన
సాకల్యమునంది, యశము జయముంగొనుడీ!

9. అప్తుడైనట్టి సత్యనారాయణునకు
నంకితమ్ముగనే బలుకాడనున్న
కృతికి, ద్యాగాబ్ధి భీష్మ చరిత్రమునకు
నిరవుకొనునట్టి యారంభమెట్టిదనిన

# త్యాగ సింధువు

1. శ్రీ వర్ధిష్ణు సరస్వతీ హృదయ రోచిస్ఫార వాగ్వైఖరీ
సేవా తత్పర సత్కవీశ్వర మనస్సీమా మహోద్యాన భా
షా వైదగ్ధ్యసుమోహ సౌరభ రసస్వాదిష్ఠ మారంద ధా
రా విస్ఫూర్తితముల్ కళారసిక సారంగమ్ములన్ దన్పుతన్!!

2. పెద్దది పొట్ట విద్దియల పెట్టియకా, నిడుపాటి తొండమా
బుద్దుల కెల్లనూపిరియ, పూజ్యుల పల్కులనాలకింపగా
బెద్దవియైన వీనులును, బిన్నలు కన్నులు బాహ్యదృష్టియే
వద్దనుచున్ననొజ్జలగు వాడు గణాధిపుడిచ్చుదీవెనల్..

3. భారతీదేవి యొసగిన పాలలోని
శక్తి, వేంకట రామయ్యశాస్త్రి ప్రేమ
స్థితిని గల్పించె వారికి సుతుడనగుట
నేను జేసికొన్నట్టి పున్నెముల పంట

4. జనని భారతి ధారణా సత్వ మహిమ
చిన్న తనమందె ప్రజల కచ్చెరువు గొలిపె
అదియు లౌకికమ్మైన విద్యలను గాక
యమృతమయమైన యట్టి వేదాంతమందు

5. కనుగవ యందునెన్నడును గన్పడరాదొక యొఱ్ఱజీర, ని
ర్ధనత కృశింప జేసినను ధర్మము తప్పెడు జాడలేదు, మ
జ్జనకు గభీరతా స్థితికి సాటికి వచ్చునె సంద్రమున్? మహా
వినయుడు వేదజీవనుడు వేంకటరామయశాస్త్రి మౌనియే.

6. జడమతులు గారు శ్రుతులం
దుడుపతులే, యెదిరి నిల్చు నుగ్రుని తలపై
తడబడక నిలుచువారే
కడిమిళ్ళాన్వయమునందు గవి నొక్కడనే!!

7. నేను వరప్రసాదుడను నిక్కము భారతి తల్లినాకు వి
జ్ఞానులమోఘ దేశికులు, సాహితియే హితమైనయట్టివా
రేనను గూడు మిత్రులునదే గదటే ద్విశతావధాన మా
ర్గాన గమింప జేసెనవురా! జనికెంతటి భాగ్యమో కదా.

8. నీ నాల్కంగల పాణినీయమది మున్నీరేమొ, మచ్ఛ్రోత్ర కూ
పానం జిందిన కొన్ని బిందువుల జీవచ్ఛక్తి సాహిత్య భూ
మ్యానైదాఘము గొంత బాపినది స్వామీ! నమ్ము. శ్రీ పాద ల
క్ష్మీనారాయణ శాస్త్రి వర్య!భవదంఘ్రిద్వంద్వమున్ మ్రొక్కెదన్.

9. రావురి వేంకటేశ కవిరాజ! భవత్పద పద్మమంటి, భా
షావధి జూడగోరితిని యాశుకవిత్వ విచిత్ర తత్వ వి
ద్యా వరివస్య చేసి యవధాన విధాన పథాన సాగ గో
దావరి పిల్ల గాలి నును తాకిడివంటి కవిత్వమీగదే.

10. ఆర్య జనాభిరామ హృదయాంబుజముల్ వికసింపజేయు జ్ఞా
నార్యముడయ్యు నత్తిలి కులాంబుధి చంద్రుడు సాటిలేని ధీ
వర్యుడశేష శిష్య గణవందిత పాదుడునైన కృష్ణమా
చార్య గురుండె దిక్కు. గురుసన్నిధి సన్నిధి నాకునెప్పుడున్.

11. కోటారావను నాలుగక్కరములే కొండంత యుత్సాహమున్
మూటంగట్టి శిరంబుపై నిడి, కళా పూర్ణుండవై సాగి, ము
ప్పేటల్ పేనుమ శబ్ద భావ రసముల్ వెల్గొందుమాయంచు, వా
గ్ఘాటమ్ముల్ గయిసేసినట్టివి శిరస్థానీయముల్ సేవ్యముల్.

12. చెఱువున స్నానమాడుటకు జేరినచో రసలోపమేమి? మా
చెఱువవధాన వేదికకు జేరినచో రసలోపమేమి? యా
చెఱువు నిదాఘకాలమున జిక్కిన జిక్కగ వచ్చుగాని మా
చెఱువునకెన్నడేని రస సిద్ధికి లోటను మాటగల్గెనే?

13. సిరిగలవాడు దర్పమురుచింపని వాడు కవిత్వమన్నచో
బరుగున వ్రాలువాడు కవివర్యులపై ధనరాశి వర్షమై
కురియగజేయువాడొకడు కోటికి గల్గునె! వడ్డి శ్యామసుం
దరుడొకడుండె నిస్తుల వదాన్యుడు నేడవధాన బోజుడై ..

14. అతని ధర్మపత్ని యా యింటి దివ్వియ
యగు సుజాత నిక్కమన్న పూర్ణ
యర్ధరాత్రమందు నతిధులేతెంచిన
గన్నతల్లివోలె గడుపు దడుము.

15. గుణములందెల్ల మిక్కిలి గొప్ప గుణము
నమృత తత్త్వమ్మునందించునట్టి గుణము
నేది యగునని నన్ను బ్రశ్నించినార
లెఱిగి యెఱిగియునేమియునెఱుగనట్లు

16. ఆ తల్లియునా తండ్రియు
బ్రాతిగ బ్రశ్నించినారు వాత్సల్యముతో
జేతస్సున దేజస్సుల
పూతలుగా నాదునెడద పొంగి పొరలగన్.

17. త్యాగము దొడ్డ గుణమ్మగు
త్యాగమునందుండునమృత తత్త్వము గనుకన్
యాగమ్ములు యోగమ్ములు
త్యాగమునకు సాటి వచ్చునా !నిలబడునా!

18. అనుచు వాక్రుచ్చినది విని యట్టి త్యాగి
యుర్వియందున నుండెనే యొక్కడేని
నుండెనేనియునట్టి పూజ్యుండెవండు
వాని చారిత్రమును జెప్పవలయు మాకు.

---

*ధర్మ శబ్దమునకు ' విల్లు' అని యర్థము
*గుణ శబ్దమునకు 'వింటినారి' అనియునర్థము

19. అనుచు నా పుణ్యదంపతి యడుగునపుడు
త్యాగశీలుండు భీష్మ పితామహుండె
యతడు బ్రదికిన బ్రదుకెల్ల ద్యాగమయము
త్యాగ జీవనమునకునాదర్శమతడె.

20. ఆగ్రహమంది భీష్ముడు మహాహవరంగమునందు దూకి, ధ
ర్మ*గ్రహణమ్ము సేసిన బలాయనమే గతి యెట్టి వారికిన్
వ్యగ్రత వీడి, చిత్తము దయాపరతంత్రముగా నొనర్చి, ధ
ర్మ గ్రహణమ్ము సేసిన నమస్కృతియే గతి యెట్టివారికిన్.

21. ధర్మగుణము శ్రుతిని దాకుచుండిన జాలు
వైరికోటి వెలలు వాఱుగాదె!
ధర్మ గుణము *శ్రుతిని దాకుచుండిన జాలు
పూజ్యకోటి యెల్ల మురిసిపోదె!

22. అట్టి పరమ పూజ్యుడైన భీష్ముని దివ్య
గాధ వినిన గుండె కఱగి పోవు
జనితరించిపోవు శ్యామసుందర!సుజా
తాకళత్ర! స్తుతి పదైక పాత్ర!

23. బాల్య చాపల్యమున నేను బల్కుచుంటి
వత్సలత్వమ్ముచే వినవలసె మీకు
ననుచు బల్కాడి, దివ్యగాధామృతమ్ము
వినుకుచున్నాడ వారె యాశీర్వదింప.

24. అమృతాస్వాదన చేసెడి
యమరునకే మానవత్త్వమమరినదేనిన్
సుమధుర గుణములకిక బా
రము గల్గునె! శ్యామసుందరా!వినుమయ్యా!

# త్యాగసింధువు

## I జననం

1. నైకామోఘ తపోధనాశ్రయము విన్నాణంపు కాణాచి వి
ద్యాకంజాత మరందతుందిల సరిద్గమ్యోరు వారాశి, ల
క్ష్మీకాంతానఘు నాభి పద్మజనిత శ్రేయోనిదానమ్ము, వా
ణీ కంజాత భవాద్భుత ప్రణయ సన్నిష్ఠమ్ము తల్లోకమే.

2. ఆ లోకమ్మున ధాత్రధిష్ఠిత సభావ్యాసంగ చేతస్కులై
ఆలోచించుచునుండ శాంతికయి బ్రహ్మాండమ్మునందెల్ల న
క్కాలంబెంత గతించి పోయినదియో కానీ, మహర్ష్యాళి, జే
జేలున్ యోగులు నిల్చినట్టి సభకున్ సిద్ధింప వేయన్నువుల్

3. అంతట వచ్చి వ్రాలినది యద్భుత రూపవిలాసహాసయై
వింతగనంచయానముల వేడ్కలనించెడి తమ్మికంటియై
స్వాంతము చిక్కువెట్టగల శైవలవేణి ధరించి సైకత
భ్రాంతి ఘటించు శ్రోణిగల పావన గంగ మనోహరాంగియై.

4. వచ్చినయట్టి వేగమున వస్త్రము సుంత తొలంగి, చూడగా
వచ్చినయందమెల్ల ఋషివర్యుల కన్నుల కంటగింపు గా
వచ్చిన వేళ పుష్పశర భారము సేసి మహాభిషుండు, తా
మ్రుచ్చిలి చూచుచుండె కల రూపము తాపమునాపలేకొగిన్.

5. ఓయి మహాభిషా! సభమహోన్నతయయ్యు త్వదీయ కామ-వీ
క్షాయుత చేష్టమై దొసగు కల్గుటచేనపవిత్రయయ్యె ధూ
ర్తా! యిక మానుషత్వమును తథ్యము గొమ్మిటనుండి పొమ్మపొ
మ్మాయని శాపమీ నలువ యాతడునౌదలవాంచె దీనుడై

6. ధీరుడు శక్తిమంతుడు 'ప్రతీపుడు' భూపతి చంద్రవంశ మం
దారుడు పుత్త్రకామియయి దైవత సేవలొనర్చుచుండ, బృం
దారక వైభవమ్ములకు తావలమౌచు మహాభిషుండు భూ
మీరమణుండు సంతసము మేకొనగానుదయించె పుత్త్రుడై.

7. శంతను నామధేయమున చందిర రూపతనూ విలాసుడై
స్వాంతము నందు చిత్తభవ చాయలు దోచెడి యౌవనమ్ము ర
వ్వంతగ నంకురించి హృదయాంగనకై తలపోయువేళ త
త్కాంతుని జెట్టపట్టుటకు గంగ తలంచె దలంచినంతలో

8. భద్రగుణపేటియగు తపోవనమునందు
శాంత గుణపేటియైన యాశ్రమమునందు
శిష్ట గుణపేటియైన వసిష్టుడుండె
దివ్య గుణపేటి నందినీ ధేనువుండె

9. ఆ వనమున విహరించుట
కైవసువులు వచ్చినారు కాంతాయుతులై
ఆ వనితల నొకరితయగు
* 'ద్యో' వల్లభ గిడ్డి గాంచి, యోహోయనియెన్

10. ఈ గోక్షీరము నిత్య యౌవనమునందింపన్ సమర్థమ్ము స
ర్వాగ స్సంపరిహార సాధకము నిత్యానంద సంపాదన
ప్రాగల్భ్య ప్రధిత ప్రభావమువనే బ్రహర్షి వర్యాయుతో
ద్యోగామోఘ తపంబు సల్పగ సమర్థుండౌచు రాజిల్లెడిన్.

11. అని వచియించినాడు విభుడాతని కాంతకు తన్మహత్త్వమున్
విని, తన మిత్రమైన యొక పిన్నది యుండె'నుశీనరాఖ్య'భూ
వనిత మనోహరాంగి, మురిపమ్మున కొన్కను జేయుదాన గో
వును గొని తెమ్ము నాకనుచు ముచ్చటగా వెలిబుచ్చె గోరికన్.

12. మునుల కోపమ్ము దుర్గతి మూలమనుచు
ఎఱిగి యెఱిగియు గోవు హరించినార
లష్ట వసువులు ప్రారబ్ధమాపదరమె
నెలతకెందేని గోరరానిదియు గలదె!

* 'ద్యో' అను వసువు వల్లభుడుగా కలిగినది.

13. గోపాటచ్చరులైన అవ్వసువులన్ గోపించి తీవ్రమ్ముగా
శాపమ్మిచ్చె మహర్షి శీఘ్రమ మనుష్యత్వమ్ము గైకొండు పో
పోపొండంచుననుగ్రహింపుమనుచున్ మ్రొక్కంగ ' మీ
కాపాపమ్మొక వర్షమే 'ద్యువు'నకో .యాత్యంతికమ్మయ్యెడిన్'

14. అనుచు విమోచనమ్ము పలుకాడగ వచ్చుచు మార్గ మధ్యమం
దున గని గంగ మౌళి పయి దోయిలిజేర్చి, నమస్కరించి, గా
ధను వివరించి, మా కొఱకు దల్లివి కావలెనమ్మ నీవు శం
తనుని వివాహమాడవలె ధన్యులమౌదుమటంచు వేడినన్.

15. గంగ యంగీకరించె నా క్షణము నంద
మరల వేరొక్క నియమమేర్పఱచినారు.
ప్రసవమందుట తోడనే ప్రాణములను
తీసి మానుషత్వమ్మును దీర్పుమనచు.

16. కన్న సంతానమును జంపగలదె కాంత
భర్త యద్దానికై యొడంబడగలాడె
ఇంత ఘోరకృత్యంబు గావించుటెట్టు
లంచు నొక్కింత తడబాటునందె గంగ.

17. అది గమనించి, యవ్వసువులాదరమొప్ప వచించినారు నీ
హృదయము కందళించుటకు హేతువు కన్గొనినారమమ్మ మా
తుదియగువాడు నీ పతికి తూరుపు ప్రొద్దగు నమ్ముమాతనిన్
బ్రదుకగ చేయవచ్చు గుణవంతుడతండగు కీర్తి మంతుడున్.

18. ఆ మాటల్విని సంతసించినది తానంగీకృతిన్జేసె ఈ
హా మంజూషకు ద్వారముల్ తెరిచె దివ్యంబైన సౌందర్య మెం
తే మొల్కెత్తిన వల్లియై హొయలు సందీపించు పుష్పమ్ములై
వ్యామోహమ్ము పరీమళమ్ముగుచు తానందందు తారాడెడిన్.

19. జీవ హింసయు మదికి రుచింపదయ్యె
నయ్యునయ్యాయి క్రూర మృగాళి వలన
హతము కారాదు జనమనునట్టి తలపు
శంతనుని బంపె గహన సీమాంతములకు

20. శర శరాసన హస్తుడై శంతనుండు
తిరిగె వనమెల్లనోపిక తరిగె గాని
ఒక్క మృగమేనినమ్మున జిక్కదాయె
నాతడే చిక్కెడప్పికి నలసిపోయి.

21 నాచు జడముడితో, సుడి నాభితోడ
సంకు గొంతుతో తొగకంటి సొరుతోడ
నిర్మలాంబు మనమ్ముతో నెగడువాక
యొకటి కనుపట్టె నందాల యువిద వోలె.

22. అదరి చేరి యంబువుల నాదట వోవగ ద్రావువేళ గ్ర
వ్యాదుల మోసపుచ్చి, యమృతాశన భాగ్యము వేల్పుకోటి క
త్యాదర లీలనిచ్చిన మహాంగన మోహిని యాత్మజాతయే
యా దివి వీడివచ్చినదియా!యనదోచె నొకర్తు దవ్వునన్

23. కలయో ! నిక్కమొ! నిద్రయో! మెలకువో! కన్దోయి మున్నెన్నడున్
దలపం జాలని వింత యందముల మొత్తమ్మొక్కచో గాంచు ని
స్తుల భాగ్యమ్మును నోచుకొన్నది గదా! తూగాడునమ్మేని సౌ
రుల కీ జీవితమప్పనమ్మయిన జాలున్ జన్మ సార్థక్యమౌ.

24. అరమోడ్పు కనులతోనతివ చూచిన జాలు
మేనెల్లనమృతంపు వానజల్లు
ఒడుపెల్ల దనదిగానడుగు వైచిన జాలు
గుండె లోతుల వింత క్రొత్త గుబులు
గాలి తాకున బైట కదలెనా రవ్వంత
పంచబాణుని ప్రేమ పలకరింపు
కనరాని నడుమునే కన్గొంట కల్గెనా
ముద్దు ముచ్చటలకే పులకరింపు
పెదవి కదిపెనా శృంగార పదవి నాకు
జిక్కుటే గాదె! ఆపెయే దక్కకున్న
వ్యర్థమే గాదె మాహేంద్ర పదవియైన
అనుచు గంగను గాంచి, శంతనుడు దలచె.

25. లక్ష్మీ నీ తల్లియా! యీ విలాసమేమి
మన్మధుడు తమ్ముడా! రూప మహిమమేమి
చందమామ నీ మామయా అందమేమి
నాతిరో! చెప్పు నీ చిఱునామమేమి.

26. అని ప్రశ్నించిన తేనికొక్క చిఱునవ్వర్పించెనానవ్వులో
తన జన్మాంతర పుణ్య సంపదల మొత్తమ్మిందు బుష్పించెనో
యనినట్లై తన మేను మొత్తముగ రోమాంచమ్మునై కొంత సి
గ్గునునాపై మఱికొంత సంతసము చేకూరెన్ ధరాభర్తకున్.

27. నవ్వుగాదది యరమల్లె పువ్వులేమొ
పువ్వులును గావుపో పాల పొంత యేమొ
పొంతయును గాదు వేల్పుల బువ్వయేమొ
ఏదియును గాక ఆనందవేది యేమొ

28. అనుచు దలపోయుచుండ నయ్యతివ వలికె
పలుకు పలుకులో ముత్యమ్ములొలుకునట్లు
చిత్తమునకింత యమృతమ్ము చిలికినట్లు
గుండె కేదారమున ప్రేమ పండినట్లు

29. గంగను నేను. విష్ణు పదకంజయుగమ్మునవొక్కవ్రేలు నా
కుంగల పుట్టినిల్లు సిరి కూరిమితల్లి మనోభవుండు ము
ద్దుం గయిసేయు దమ్ముడు విదూర తలమ్మున వెల్గుచున్న నా
బంగరుమేనిచాయ గలవాడు శుభమ్మౌన గూర్చు మామయున్.

30. నీ చూపులు నా తమ్ముని
పేచీ పట్టులకు నిలచు వేదికలయ్యేన్
నీ చెలువము నాలో విర
బూచిన యందముల చెలిమి పుట్టగ నొప్పెన్.

31. నీ యెదయెల్ల నా సొగసు నిల్చినదే యనుకొమ్ము, సంత స
మ్మేయనుకొమ్ము, మానవుడవీవునయోనిజ నేను గాన నా
పై యనురాగముంగొనుట భావ్యము గాదని నీవెఱుంగవే.
ఏ యెడనైన నింగిని వరించుట చెల్లునటయ్య నేలకున్.

32. అని పలుకాడు గంగ మరియాదకు భాష్యముగా స్ఫురించె ప్రే
మనుగని త్రోసి రాజనదు మాయెడగల్గిన జాతి భేద రే
ఖను గని, కాదు పొమ్మనదు కాంక్షకు జాతికి మధ్య హద్దు శం
తనునకు గుండెలో బలుగు త్రవ్విన యట్లయి పల్కెనామెతో

33. స్త్రీ పురుషులు కలగలుపుగ
గాపురముండుటకు బ్రేమ గావలె గానీ
ఈ పుట్టుక గల జాతులు
శాపములై వలపు దలపు జంపగ వలెనా

34. ఒక్క జాతియై ప్రేమ లేకుండెనేని
బలవదుద్వాహమునకొడంబడిరె యేని
కలువ కాంతకు మొసలితో జెలిమికాదె
అదియు నిదియును జలజాతి యగునుగాత.

35. కలువకు జందమామకును గల్గిన మైత్రికినర్థమేమి, త
మ్ములకును జిత్ర భానునకు బొందికలో గల సూత్రమేమి, యే
కొలములొ! జాతులో! యెదల కూర్మికి తావలమయ్యెనేనినే
కులమని సాగరుండు తనకూతును వెన్నునకిచ్చె జెప్పుమా

36. భూమి సుత యా యయోనిజ
రాముడు యోనిజుడు నరుడు. ప్రణయమ్మున యం
దీ మహియందా సీతా
రాములకున్ సాటిగలరె రామా! చెపుమా.

37. అని పలుకాడు శంతనుని యాదరమాతని ప్రేమ సాగర
మ్మును గమనించి, గంగ రసపూర్ణ తరంగితయయ్యు బల్కె భూ
జనపతి!నీవు పల్కినది సత్యము, ధార్మిక భాజనమ్ము నా
కును గల నేమమొక్కటి యకుంఠితమప్రతి హన్యమానమున్

38. ఎన్నడేనియు నా చేయునెట్టి చైద
మేని నీ మానసమును నొప్పించుగాక
అయ్యు నాకడ్డబడ చెల్లదడ్డు వడిన
దత్ క్షణము నంద నిను వీడి తరలిపోదు.

39. ఇందుల కిష్టమేని వరియించెద. నీకు పరిగ్రహంబనై
పొందికలో మహాసుగుణ మూర్తిని బిడ్డను గాంచి, దేవతా
బృందములెల్ల వాని దృఢ దీక్షను, ధార్మిక జీవనమ్ము నా
నందముతో ప్రశంసలిడునాడు కృతార్థగ బొంగి పోయెదన్.

40. జన్మసార్థకమైనట్లు సంతసించి
నాడు నిలువెల్ల బులకించినాడు ఱేడు
ఇంతి నియమమ్మునంగీకరించినాడు
మించు ప్రేమతో గరము గ్రహించినాడు.

41. శృంగారాపగలో రసాంగి జతగానీదాడి యానందముల్
పొంగుల్ వారుచు నుప్పరమ్మెగయ గాముండేయు బుష్పాస్త్రముల్
రంగుల్ వారుచు నాకసమ్మునకు జిత్రమ్మైన యందమ్ముదె
చ్చెం గాంచన్ గగనారవిందమును దోచెన్ సత్యవాక్యమ్ముగన్

42. ఒక్కొక్క వత్సరమ్మును
నొక్కొక్క క్షణమ్ము వోలెనురుకుచునుండన్
చిక్కని రసానుభూతికి
జిక్కిన యాఱేడు తృప్తి చిక్కని వాడై.

43. గంగమాటకెదురు కలనైన బలుకడు
చెయిదములకు నడ్డు చెప్పబోడు
ఆమె పలుకు మంత్రమై చేత భాష్యమై
ప్రేమకెదురు గలదె విశ్వమందు

44. ప్రేమకు ఫలమై జంపతి
కామితమీడేర్చు సుతుడు కలుగుచునుండన్
ఆ మాతృదేవి పుత్ర
ప్రేమను దిగమ్రింగి నీట విడుచుచునుండెన్.

45. ఒకరా! యిద్దరా! ముగ్గురా!నలుగురా! ఒక్కొక్క యేడాది కొ
క్కొకడై యేడ్గురు నీటి పాలగుటయా!ఉన్మత్త శృంగార వాం
ఛకు లోనైతిని, బిడ్డలన్ మెసవితిన్ స్వమాట్టునైయుండి, కాం
తకు లోనై, శిశుహంత నైతినిక క్షంతవ్యుండనెట్లయ్యెదన్

46. జీవమ్ములు నిలబెట్టెడు
జైవాతృక వంశమందు జన్మించియు గా
మావిలచిత్తుడనై ని
ర్జీవులుగా సుతుల జేసి నిర్దయనుంటిన్

47. అని లోగుందుచు శంతనుండు సతితోనచ్చట్లు ముచ్చట్లు మా
నిని వైనమ్మును లేక, పూర్వ ఫణితిన్ నిత్యమ్ము కామోత్సవ
మ్మున వెఱ్ఱెత్తుచు జిందులాడుచు మహా మోహమ్ములో మున్గి పో
యిన వైనమ్మును లేక, మధ్య గతుడయ్యెన్ బుత్ర లాభార్థియై .

48. తూరుపు దిక్కున సూర్యుని
తేరరుదెంచుటకు మున్ను, దివ్యమ్మగు దే
జోరాశి నింగినంటెను
వారాశులు పొంగె విరుల వాసనలెగసెన్

49. శంతనుని కంటి కొలకుల
వింతగనమృతంపు వాన వెలిరాబొచ్చెన్
అంతరమున నిలువెత్తున
సంతోషము పుష్టిచెంది సందడి సేసెన్.

50. ఒక మగబిడ్డ, యేడుగుర యూర్జిత శక్తి ధరించినట్టి య
ర్భకుడుదయించినాడమృత భాక్కు నరాపఘనమ్ము దాల్చి, భూ
మికి దిగి వచ్చినాడచలమేదుర వీర్య గుణాభిరామ శా
సకుడగునట్టి యా శిశువు జాలిగ గ్రుక్కెడు పాలకేడ్చెడున్.

51. బిడ్డ యేడుపు ప్రణవమ్ము వినిచినట్లు
మధురమై తోచె లోక సమస్తమునకు
కాని యా తల్లి తట్టుకోలేనిదగుచు
గుండెకత్తుక పట్టి చన్గుడప సాగె

52. ఇది తగువేళయంచు గమనించి, సమీపము జేరవచ్చి, యి
య్యదునున బాలు పట్టెదు, క్షణాంతరమందున నీటి పాలు సే
సెదవిది మాతృ ధర్మమని చెప్పిరె నీకెవరేనినొక్క గొ
డ్డుదియును జంటి బిడ్డల మడంగున ద్రోయుట కిచ్చగించునే.

53. పుట్టుచునున్న బిడ్డలను బుట్టియు బుట్టక ముందె నీటిలో
నెట్టిన నీ దురాగతము నేను సహింపగజాలకుండియున్
బట్టున గుండెయందదిమి పట్టితి, చేసిన బాస తప్పుచో
చుట్టెడు పాపమో మదన చోదిత తాపమొ కట్టివైచుటన్.

54. ఇంక పాపమ్ము నన్ను వధించు గాక
హృదయ తాపమ్ము నన్ను దహించుగాత
ప్రేమ పాత్రుడై ఈ యొక్క బిడ్డడైన
నిలువవలెనంచు తేడడ్డు పలికినాడు.

55. ఆ పలుకాలకించి, దరహాసముతో దలయూచె గంగ, నీ
వీ పసివాని నెవ్విధి భరించుచు సాకెదవయ్య, వీని నా
ప్రాపున నుంచెదన్ వయసు వచ్చుట తోడనె అప్పగింతు రా
జా! పలు విద్యలన్ గఱప జాలెద నన్నిటు విశ్వసింపుమా.

56. అనుచు ఒప్పించి, గత చరిత్రను వచించి,
నీమమును జేసి యా గంగ నింగికెగిరె
ఆమె లేదన్న బాధ రవ్వంత కలిగె
ఆత్మజ ప్రాప్తి దృప్తి కొండంత మిగిలె.

# త్యాగసింధువు

## II ప్రతిన

57. ఏ గంగ సౌందర్యమీక్షించి సభయందు
ప్రాగ్జన్మమందు శాపమ్ము వడసె
ఏ గంగ సౌందర్యమీక్షించి ఈ జన్మ
ఆమెకే యప్పనమ్మంచునెంచె
ఏ గంగ సౌందర్య మీక్షించి, తనకడ్డు
పలుకబోనని తాను బాససేసె
ఏ గంగ సౌందర్యమీక్షించి, తనకన్న
బిడ్డలన్ నీటిలో విడువనిచ్చె
అట్టి గంగయు విడనాడి యవల జనియె
(వీ) వేడుకొన్నది యే కన్నబిడ్డ కొఱకొ
చిత్రమాతనింగూడ దీసికొని పోయె
రెంటికిని జెడ్డ రేవడీ ఱేడు నేడు.

58. ఈ విచారము తోడనే యేండ్లు పూండ్లు
గడచుచుండగనొక్కనాడడవికేగె
క్రూర మృగముల వెంటాడు కోర్కి తోడ
నచట శుష్క గంగా ప్రవాహమ్ము గనియె.

59. ఇదికాదు నిదాఘము, కానీ
నది యేలా చిక్కెనంచు నాటిన శంకన్
బదిపది యడుగులు వేయుచు
బది యారేండ్లున్న యొక్క బాలుని గనియెన్.

60. ఎన్ని బాణమ్ము లెట్లు గుప్పించినాడొ!
అమ్మహో ప్రవాహమ్మునకడ్డు నిలిపి
నీటినే నిల్వరించిన నేర్పుకాడు
పిన్న వాడయ్యు శస్త్ర సంపన్నుడతడు

61. ఈ పసిబాలుడెట్లు ధనురేక సహాయుడుగా బవిత్ర గం
గాపగ నిల్వరింపగల యంతటి వాడయినాడు క్షాత్ర వి
ద్యా పరమాద్భుతాంచిత మహాజునుడీతడు క్షత్రియుండె కా
నోపునెడంద వీని గని యూరక వారక సందడించెడిన్.

62. నరతనువును దాల్చిన కి
న్నరుడో,కింపురుషవరుడొ! నాకమ్మునసే
పొరబాటొనరించుటనో
పరమర్ష్యభి శప్తుడగుచు బడెనో పుడమిన్.

63. ఇతనికిని నాకు గల బంధమేమొగాని
కలుగుచున్నది యొక కోర్కి కౌగిలించి
తనివి తీరగ ముద్దాడి, మనమునందు
బండు వాత్సల్యమును బంచవలయునంచు

64. కానీ తెలియని వానిని
నీ నరనాధునకు కౌగిలించుట దగునా
మానస భవ వత్సలతో
ద్యాన జనిత పుష్ప గంధమాపం దరమా.

65. అనుచు జింతించుచున్న శంతనుని కనుల
గోటి దీపాలు వెలిగించుకొనగనెంచి
గుండె గిన్నెలో నెయ్యమ్ము గుస్తరించి
యచట వ్రాలెను గంగ ప్రేమాంతరంగ.

66. గంగా దర్శనమాత్ర సంజనిత రాగస్నిగ్ధ మోహమ్ములు
ప్పొంగన్ బొంగుచునింకినట్టి ప్రణయాంభోరాశి యువ్వెత్తునన్
నింగిన్‌దాకి తలంపు తారకలకున్ స్నేహాభిషేక క్రియల్
సాంగోపాంగ సుమాస్త్ర వేదహితముల్ సాగించినట్లయ్యెడిన్

*'జామదగ్ని' కర్ణ భారమ్‌లో భాసుని ప్రయోగం

67. అంతలోననె మదిలోని కంతు గొంతు
నులిమి బిగపట్టి నియమమ్ము నిలుపు కొనుచు
కేవల స్నేహ దృక్కులం గీలు కొలిపి
కనుల తోడనే కుశలాదికములనడిగె.

68. ఏకిమీని నిగ్రహమునకు
నకలంక స్నేహ వర్ధితాదరమునకున్
సకల శ్రేయోదాయిని
ప్రకటించెను. గంగ ధన్యవాదాంజలులన్

69. రాజా! నేనొక నాడు నీ ప్రణయ సామ్రాజ్యానకున్ రాణినై
రాజన్నాక జనాభిభోజ్య వదనున్ రాజన్య వంద్యున్ గుణ
భ్రాజిష్ణున్ సకలాగమార్థ వినుత వ్యాసంగ చేతస్కు ది
వ్యౌ జశ్శాలిని గాంచి యుంటి దృఢ దీక్షాయత్తు దేవవ్రతున్.

70. ఈ బాలుండతడే నీ
సాబాలును మఱియు నాకు సాబాలగుచున్
ధీబల భుజబలములు దీ
క్షాబలమున పెంచుకొనెడి సంయమి యితడే.

71. శాస్త్ర విద్యలందు శస్త్రాస్త్ర విద్యల
యందు రాజనీతి యందు ఘనుడు
వేద విద్యయందు వేదశిరోవిద్య
యందు గూడ పారమందినాడు.

72. నేర్పరియై పెను తగవుల
తీర్పరియై విజిత రాజ తేజుండై ధ
ర్మార్పిత తనువై నిచ్చలు
కర్పూరపు కళిక తానుగా వెలుగొందున్

73. ఎన్ని విద్యలు నేను నేర్పించినానొ!
ఎంత వానిగ దీర్చి దిద్దించినానొ!
సూరిముని వరిష్ఠుడు వసిష్ఠుండు సాక్షి
* తప్త భూజానియగు జామదగ్ని సాక్షి

74. అంచు సుతుబట్టి కాళ్ళు మ్రొక్కించె గంగ
చేతులంబట్టి గుండెకు జేర్చుకొనియె
తండ్రి యా రెండు గుండెలు తాకునపుడు
సడిని వివరింప గలిగిన నుడులు గలవె.

75. ఆ గంగాసతి యరుగగ
నీ గంగా పతియు సుతుడునింటి మొగమ్మై
యేగంగా ముప్వురిలో
దూగంగా తోచె కొంత తుష్టియు దిగులున్.

76. గంగా దర్శనమై, యనూహ్యముగ గంగా సంగమంబై, పున
ర్గంగా దర్శన భాగ్య మొక్క క్షణమై కాలమ్మె యాటాడి పో
యెంగానీ, తరి తీపికిం గుఱుతుగానీ బిడ్డడే చాలు జా
లుం గొండంత లభించి తృప్తి జనపాలుండుండె సానందుడై.

77. ద్రవ్య నవకమందొకటియై తనరుచుండు
కాలమని తర్క విదులు పల్కంగ వచ్చు
దాని లీలా విభూతికిన్ దగిన హేతు
వొకటి చూపింప గలుగు దార్కికుడు గలడె.

78. కాలమ్మొక్క విచిత్రగాపగ జనుల్ కాల ప్రవాహమ్ము నం
దేలా కొట్టుక పోదురో యనుచు దామెంతేని శంకించి, త
ల్లీలాన్వేషణ జేయు బండితులునోలిన్ దద్ ప్రవాహమ్ము నం
దే లోభమ్మున మున్గి పోవుటలు కావే కాల లీలా గతుల్

79. దేవవ్రత గుణ గణములు
ధీ వైశారద్య గరిమ తృప్తి ఘటింపన్
భూ వల్లభుడానందో
జ్జీవనకర జీవనమ్ము చేయుచునుండెన్.

80. తనయు యౌవరాజ్యాభిషిక్తునిగ జేసి,
యతని యేల్బడి భావి భారతము నందు
గలుగు వైభవ పటిమకై కలలు గనుచు
గడుపు చున్నాడు భావికి గర్తలెవరు.

81. ఒకనాడూరకయే విహారమునకై యొక్కండుగా ఱేడు మే
చక నీరాపఘనమ్మునే కలిగియున్ సౌందర్య సమ్రాజ్ఞియై
ప్రకృతిన్ మైమరపించునట్టి యమునన్ భద్రాపగన్ వీక్షణో
త్సుకతన్ జేరి, చరించుచుండునెడనందున్ గాంచె నొక్కర్తుకన్

82. పుడమి గుబ్బెత నల్లని జడను దురుము
మల్లె పూబంతి యాబంతి మధ్య యందు
పసిడి వన్నెల చామంతి వలెనె నుండె
జమున యందంచ నావలో జాన యొకతె.

83. చాన గాదది యెదదోచు జాణగాని
తరుణి గాదది యందాల బరిణగాని
కలికి గాదది వలరాజు ములికి గాని
యింతి గాదది కనుదోయి కాంతిగాని.

84. కొంగు బిగియించి పావడా కుచ్చె నొకటి
పట్టి మెల్లిద్రిప్పి నడికట్ట నెట్టికొనుచు
చేత చుక్కాని పట్టిన చెలియ యొడుపు
పడవనో రాజునెడదనో నడుపుచుండె.

* భాస శ్లోకమునకు గౌరవ స్వీకృతి

85. ఊరక యమునా తీర వి
హారమునకు వచ్చి యందునచ్చెరువుగ నొ
య్యారముల మొలక సొగసుల
సొరునకున్ మరులు గొనియె శంతనుడంతన్.

86. ఆ పడతి చూపులే విరి
తూపులుగా గుండె నాడి తొలచుచునుండెన్
ఆ పెదవి విప్పి పలికిన
బాపురె మది పరుగు పట్ట పగ్గములున్నే.

87. ఎన్నో యేండ్లకు బూర్వమిప్పగిది బంచేషు ప్రపాతమ్ము చే
*ఛిన్నంబైనది గుండె గంగ గనుచో, జిత్రమ్ము పుష్పాస్త్ర వి
*చ్ఛిన్నంబయ్యె మరొక్కమారిపుడునక్షీణాతి లావణ్య సం
పన్నన్ ధీవర కన్య గాంచి స్మరుడున్ బంచేషువెట్లయ్యెడిన్.

88. అనుచు దలపోయుచున్న శంతనుని కనులు
వలపు తొలకరి వానజల్లులకు గనుల్లు
తగులు కొనువేళనా లేత తనువు తడిసి
ముద్దయైపోయి సిగ్గుతో ముడిచికొనియె.

89. ఓ సామి! నీ చూపుల
బాసలు నా వలపుటింటి వాకిటి గుమ్మం
బోసరిల దలపు తలుపులు
తీసినటుల్ గుండె కొంత దిటవున్ దప్పెన్.

90. పడవ నడుపుచున్నట్టి పడతి సోగ
కంటిలో గన్ను గలిపెడి దంట తనము
పాడియా మీకునొక పల్లె పడచు మనసు
నింత యల్లరి పాలొనరింతురేల.

91. చేపలు పట్టెడి బ్రదుకుల
కీ పుడమి నెలంత గుత్తయేలుబడులకున్
బాపురె జత యొడగూడు నె
మీ పొందిక మీకు మాకు మేల్గాదు దొరా!

92. అని పలికిన యా కన్నియ
మనమెఱిగిన ఱేడు మరల మచ్చిక చూపుల్
గొనకొని విసరుచునెడమో
పనివాడై పెదవి విప్పి పలుకందొడగెన్

93. ముదితా!నీ విటు బల్క బూనుకొనుటల్ ముగ్ధత్వమే గాని, నా
హృదయ ద్వారము నిష్కవాటముగ నీకే స్వాగతంబిచ్చి, నీ
సదనంబై పరిపూతమై మనుటకై సంసిద్ధతన్ జూపు స్వ
చ్ఛదరస్మేరములాన ప్రేమ కలకున్ జాత్యాదులడ్డంకులా

94. ఇంతకు నీ పేరేమిటి
యింతటి సుందరికి జన్మనిచ్చిన వాడీ
పొంతనె గలడే యెవ్వం
డింతీ! వచియింపుమతనినే యర్థింతున్.

95. అని పలికిన శంతనునకు
తనువున విరబూచు దృష్టి దాచుచునే, మో
విని బుట్టు వణకుచే సి
గ్గునబడి గద్గదము తోడ గోమలి పలికెన్

96. తన పేరు తండ్రి పేరును
నునికియు సూచించి యొక్క యుదుటున జనెనా
వెనుకనె పడి శంతనుడున్
జని, చని యా దాశరాజు సన్నిధిసేరెన్.

97. పుడమినినేలెడి దొరయే
నడచుచు నాగూడు చేరినాడే యనుచున్
దడబడి ధీవరుడబ్బుర
పడి, యెదురుగనేగి యైదు పది గావించెన్.

98. మీ వంటి దొరలు పల్లెల
కై వచ్చుట వింతగాదె కానుకలిత్తున్
బూవుందేనెలో! పండ్లో!
జీవముగల జలచరాలొ! చెప్పంగదవే.

99. మనసులో గోర్కి పెదవి మాటుననె యుండ
కనుల సైగలు గాంచి యాక్షణమునంద
చేయగలవారు నీ చుట్టు చేరి యుందు
రయ్యు మా తృప్తికేదేని యడుగవలయు.

100. అను దద్వ్యాహృతికిచ్చమెచ్చుకొని నేనత్యంతమున్ దృప్తి గొం
టిని నీ ముద్దుల కూతునే యొసగి పెండ్లిన్ జేసి నీ యింటి య
ల్లునిగా గైకొనుమయ్య, సత్యవతియే లోకమ్ముగా జీవిత
మ్మును సాగింతునటంచు ఱేడు వలికెన్ మోమోటలన్ వీడుచున్.

101. కలనైనను నూహింపని
పలుకుల నాలించి ప్రణతి వాదమ్ముల నం
జలి బద్ధుడౌచు విభునకు
బలికెను సత్యవతి జన్మవైనమ్మందున్

102. సత్యవతికినుపరిచర వసువే తండ్రి
తల్లి 'యద్రి'నాక తరుణియామె
కాలలీల యేమొ కాని వారికి బుట్టి
పెరుగుచుండె నాదు బిడ్డవోలె.

103. ఒక్క మహాత్ముని తేజం
బిక్కాంతకు నిట్టి జన్మమిచ్చుట చేతన్
నిక్కమ్ముగ భూకాంతుడె
దక్కగ వలెనంచు సతము దలచుచునుంటిన్

104. కానీ మాదొక నియమము
భూనాధా! నాదు పట్టి పొట్టెయ తేడై
ఈ నేలనేలవలయును
దానికొడంబడిన బెండ్లి తప్పక జరుగున్.

105. పలుకులు గావవి తేనియ
చిలికిన చురకత్తులగుచు జీల్చెను గుండెన్
వలపణగారక, తనయుని
బలిసేయగ లేక దుఃఖ భాజనుడయ్యెన్

106. తన సుఖ సంతోషములకు
దనయుల తల(వ్రాతమార్చు దండ్రులు గలరే
గనుకను మీ నియమమునకు
మనసొప్పదటంచు తేడుమఱలె వెనుకకున్

107. తనయ ప్రేమ యొకింత, పుష్పశర సంతాపమ్మునొక్కింత రా
జునకుం గుండియ పిండుచున్నటులు దేజోరాశియైనట్టి మా
నినియే కంటికి చీకటుల్ పులిమి బంధింపందొరంకొన్నయ
ట్లును సంతప్తుడు గాగ గాలమును గెంటున్ తేడు నిర్లిప్తుడై.

108. మాటనీలేక యిచ్చిన మనసు తిరిగి
తీసికొనలేక యెదయెల్ల దిగులు నిండి
సెగలు పొగలుగా రగిలి కృశించుచున్న
తండ్రి దుఃఖ కారణమును దనయుడెఱిగి

109. తండ్రి సుఖపెట్టజాలని తనయుడేల
వాని బ్రదుకేల నీ రాజ్య పదవి యేల
పుట్టుటకు మున్ను లేని నా గిట్టునపుడు
వెనుకబడి రాని పదవికా పెనుగులాట

110 కాంతా కనకమ్ములపై
చింతయ యేకోశమునను జిత్తమ్మున ర
వ్వంతయు సోకని నాకా
వంత యశాశ్వతములైన పదవుల యెడలన్.

111. నీ దౌహిత్రుడు భూమినేలు వినుమా! నిక్కమ్ముగా రాజ్య కాం
క్షా దారిద్ర్య మహార్ధ సంపదకు నే సమ్రాట్టునై, భ్రాతృ సే
వా దీక్షా పరతంత్రతన్ నడతు, విశ్వాసమ్ము సంధించి, క
న్యా దానంబొనరించి, మజ్జనకు నానందాబ్ధి ముంచెత్తుమా.

112. అని గాంగేయుడు పల్కిన
విని పల్కెను దాశరాజు పృథివీపతినం
దన! నీవు వదలినది, నీ
తనయులు విడనాడుకొనగ దలతురటయ్యా!

113. కనుక సందేహపడుచుంటి గాని నాకు
బుడవి తేడల్లుడౌచుంట ముదము కాదె
మిమ్ము నమ్మెద మఱి నాకు నమ్మ బలికి
బిడ్డ గొనిపోవుటెంతయు దొడ్డ గుణము.

114. ఆ మాటలు తన భావికి
స్వామిత్వమునెఱపుచుంట భావించిన గం
గా మాత ముద్దుబిడ్డడు
సేమము జనకునకు గూర్ప జేసెను. బ్రతినన్.

115. జనక వాక్పాలనాచార శీలుండైన
సంయమీంద్రుండు దాశరథి పైని
జీవరాశికి నిత్య జీవనాధారమై
తన రారు బంచ భూతముల పైని
మాతృత్వ ధర్మ సంపాదనాలోలయై
కడుపార ననుగన్న గంగ పైని
పుత్రాభ్యుదయ మాత్ర పూర్ణ ఫలావాప్తి
తలపోయు నా కన్న తండ్రి పైని
బాస చేయుచునిచ్చోట బలుకు చుంటి
సార్వభౌమాధికారమ్ము సన్యసించి
బ్రదికి నన్నాళ్ళు నైష్ఠిక బ్రహ్మచర్య
దీక్ష వహియించు చుంటి సందియము విడుము.

116. చుక్కలు నేలరాలినను సూర్యుడు తూర్పునస్తమించినన్
గ్రక్కదలాడి దిక్కరులు కంపము నొందిన, సంభ్రమింకినన్
తిక్కల తీనిలో సెగలు రేగిన పర్వతముల్ చలించినన్
నిక్కము సుమ్ము ' శాంతనవనిష్ఠ' చలించుట కల్గదెన్నడున్.

117. సాత్యవతేయ గణమ్మే
సత్యమ్ముగ సర్వభూమి శాస్తలు, తత్సాం
గత్యమ్మున ధార్మికతా
నిత్యుడనై మసలుకొందు నియతవ్రతినై

118. నైదం పూర్వ కఠోర దీక్ష తన సంతానమ్ము గైకొంట గం
గాదేవీ తనువెల్ల నీరగుచు త్యాంగబన్న నా సంతుదే
కాదేయంచు రవంత సంతసము పొంగన్ బొంగుచున్ వంశమే
లేదా! యంచునులో సుడింబడుచు బొర్లెన్ నేలపై దొర్లుచున్.

119. వేల్పులెల్ల పుష్పవృష్టిని గురిపింప
పరమ ఋషులు స్వస్తి వలికినారు
దాశరాజు మిగుల తనివోయి ముదమందె
కాని సత్యవతికి గనులు చెమరె.

120. దాశరాజొడంబడినాడు తరుణినొసగ
ననుచు దెలిసికొన్నాడు శంతనుడు మిగుల
సంతసించుచు బెండ్లాడి సత్యవతిని
ముద్దుముచ్చట్లతో బ్రొద్దుపుచ్చు చుండె

121. ఎన్ని జన్మల పుణ్యమో! యీ లతాంగి
సత్యవతి నాకు జాయయై సరసభూజ
భావనామృత పూర్ణమై పక్వమైన
ప్రేమ ఫలమిచ్చె ననుచు భావించు రేడు

122. తనకు గల్గిన సంతోష ధనము పుత్ర
భైక్షమను సత్యమాకాంత వలన నెఱిగి
పృథ్వి కంపించి తలపైని బిడుగుపాటు
కలిగినట్లయ్యె, క్రుంగె భూకాంతుడపుడు

123. శంతనుడా తనయుని దన
చెంతకు బిలిపించుకొనియె శిరసు నిమురుచున్
వంతగొని కంటినీళుల
దొంతరనభిషిక్తు జేసె తూలెనవనిపై

124. ఏంతపని జేసి నాడవోయీ! తనూజ!
నాదు సంతోషమునకునై నీదు బ్రదుకు
దారుణమ్ముగ బలివెట్ట దలచినావు
నన్ను బుత్రభుక్కును జేసినాడవయ్య

125. నీ జన్మము సకలావని
భాజన సన్మానములకు బాత్రమ్మయ్యెన్
నా జన్మము సకలావని
లో జీత్కృతి పాత్రమయ్యె రోదన మిగిలెన్

126. తనయుని మ్రింగిన తండ్రికి
గన వచ్చునె పుట్టగతులు గానిమ్మిపుడే
మనుకొనిన ఫలము గలదే
మనుమా! స్వచ్ఛంద మరణ మహిమాత్తుడవై

127. అనిదం పూర్వ మహా ప్రతిజ్ఞయిది భీష్మాభిఖ్యతన్ గీర్తి భా
జనమాద్యాశ్రమ భాక్త్యమున్ బడయుమా సద్ధర్మసంపాదివై
మనుమా! నీదు పరాక్రమమ్మును సయింపన్ మీసముల్ ద్రిప్పిని
ల్చిన వాడుండడు నా వరమ్ము నిజమై జీవింపు దేవవ్రతా!

128. అనుచు వరమిచ్చినట్టి నాయనకు మ్రొక్కి
కనులు విప్పార్చి దాసోహమనియె గాని
పెదవి విప్పడు ధర్మార్థ విజ్ఞుడయ్యు
'మౌనమున కంటె మధుర వాఙ్మహిమ గలదె'

# త్యాగసింధువు

## III గురు సమరం

129. పెండిలిని వీడె దేవవ్రతుండు గనుక
వంశమంతటితో నిలుపంగ రాదు
నమ్మి వచ్చిన కాంత సంతతిని గాంచి
తనియ వలయునునిది తన ధర్మమగుట.

130. సాగించెను సంసారము
సాగెను గాలమ్ము. పుత్ర సంతతి గలిగెన్
సాగెన్ మఱొక్క వత్సర
మాగరితకు మరల మరొక యాత్మజుడొడమెన్.

131. పెద్ద చిత్రాంగదుండన్న పేరు వడసె
బిన్న పేర్గాంచెను విచిత్ర వీర్యుడనుచు
వారి శైశవాలోకన భాగ్యమునకు
నోచనేలేదు రాజు కన్నులను మూసె.

132. ఏ తండ్రి సుఖముకొఱకై
భూతలముననెవ్వరేని బూనని దీక్షన్
బ్రాతిగ గైకొనినానో
ఆ తండ్రియ నన్ను విడచెనవనిని విడచెన్

133. గంగనింగికరిగె గాంతుని విడనాడి
కాంతుడేగె నేడు కాంత విడచి
పుట్టునప్పుడొంటి పోవునప్పుడునొంటి
నడుమ కలుగు దోడు నాటకమ్ము.

134. తన రాజ్యము మిగిలెనొకో
తన కాంతయు వెంటబడెనె తనయులమేనిన్
వెనువెంట బడిన వారమె
తనదని యనుకొన్నదెల్ల తన తోడగునే.

135. ఇంతియగద యీ జీవిత
మింతియనుచు బిడ్డలనుచు నేడ్చుటగానీ
యంతిమ కాలమ్మున దన
వంతై నిలచునది కర్మ ఫలమొక్కటియే

136. ఈ రీతిని శోకాగ్నిని
వైరాగ్యాంబువుల చల్లబఱచుకొనుటలో
ధీరుండై భీష్ముడుపసి
వారల తమ్ములను బెద్దవారల జేసెన్

137. తల్లికి సత్యవతికి బ్రణ
మిల్లుచు రాజ్యమ్ము శత్రు హీనమ్ముగ వ
ర్తిలుటకునై కృషి చేయుచు
బల్లిదుడై సోదరునకు బట్టము గట్టెన్

138. ఒక తండ్రి బిడ్డలెల్లరు
నొకరీతిగనుంట యెట్టులొడగూడును తా
నొకటి తలంచినచో వే
రొకటిన్ దైవమ్ము తలచుచుండును గాదే.

139. అకట చిత్రాంగదుండు బలాతి గర్వ
మత్తుడైపోయి, యొక్క గంధర్వుతోడ
యుద్ధ మొనరింప నుంకిచి యుసురు బాసె
అనువు బాసిన పోరు శ్రేయమ్మునిడునె.

140. పిదప విచిత్ర వీర్యునకు భీష్ముడు పట్టము గట్టి, సర్వసం
పదలను గూర్చి పెట్టి, పరిపాలనలోగల మర్మమేమొ ! యా
పదలను దాటుటెట్లొ ! తన వారెవరో ! పెఱవారలెవ్వరో !
యది గ్రహియించుటెట్లొ ! పరమాదర లీల వచించెనొజ్జయై.

141 ఎడబాసె నాథుడప్పుడు
నెడబాసెను సుతుడు నేడునికనిద్దఱిలో
గొడుకొకడు పెండ్లియాడుట
కొడబడడట సత్యవతికి నూరటగలదే.

142. జీవితమున గష్టమ్ములు
ప్రోవులుగా వచ్చువేళ బూనిక నెటులో
గావింపవలయు నొక్కఁడు
భావహమగు కర్ణమప్పుడాగున్ బాముల్

143. కోడలు వచ్చిన గానీ
పీడలు విడనాడవంచు భీష్ముని తోడన్
జేడియ విపదంబుధికి
వోడవుగద యనుచు బలుకనూకొనెనతడున్

144. కాశీరాజు సుతాత్రయమ్మునకునై కల్యాణమున్ జేయగా
జేసెన్ గొల్పు, స్వయం వరమ్ము ప్రకటించెన్, బీష్ముడా కన్యలన్
రోసం బొప్పనెదిర్చు రాజకుల వీరుల్ వెన్ను జూపింపగా
మీసమ్ముల్ మెలిద్రిప్పి తెచ్చి యిడె నెమ్మిన్ దమ్మునిల్లాండ్రుగన్.

145. కనులు మూసి తెఱచు క్షణ కాలమందున
క్షాత్ర ధర్మమొకటి జరిగిపోయె
నటులె యిష్టపడిరి యంబికాంబాలిక
లంబ యెకతె మాత్రమడ్డువలికె.

146. అయ్యా! ధర్మవిదుండవీవనుట సత్యంబౌత, నా చిత్తమున్
వ్రయ్యల్ చేయకు సాళ్వ భూవిభుని నారాధించుటే జీవితం
బయ్యెన్ నాకు, మదీయ జీవనము నందానందమో! దుఃఖమో
నెయ్యమ్మో! యతడే సమస్త మెటులన్ నీ తమ్మునింగూడెదన్

147. ఉచితముగాదు క్షత్రియకులోచితమే యగుగాక స్నేహని
ర్వచనము చేసికొన్న యొక పచ్చని గువ్వల జంట ప్రేముడిన్
బచనము చేసికొంటకు వివాహమునాడగనిచ్చగించి, లో
రుచిగొనువేళ బెంటిని బరుండు బలాత్కృతి బట్టి తెచ్చుటల్

148. నా మానస మెవ్వనిపై
ప్రేమముగొనె వానికంటె వీరుడవగుచో
స్వామి! జోహారులు, నా
సామికి సామేను వేఱు పఱచుట తగునా.

149. వీరభోజ్యంబు రాజ్యంబు పృధివియందు
నైననగు గాక కాని నే నబలనయ్య
అబలలను గూడ వీరభోజ్యలుగనెంచి
పట్టి తెచ్చుటయే మగపాడి యగునె.

150. రమణియును రాజ్యమొకరీతి రాజులందు
నిలువ వలెనంచునెవ్వాడు పలికినాడు
దాని కొడబడు ధర్మ శాస్త్రములు కలవె
యటులనుండినవేని గాదందు నేను.

151. నారిని బూజించిన బృం
దారకు లానంద పడెడి ధరణిని నేడీ
దారుణమిటు జరిగినచో
నూరు కొనునె, స్త్రీల యొర్మి యుసురై తగులున్.

152. ప్రేమకు గల మాధుర్యము
ప్రేమంబడు వారికెఱుక వీరుడవయ్యున్
బ్రేమనెఱుంగని నీకీ
ప్రేమ విలువ తెలియ గలుగు విజ్ఞత యున్నే.

153. తండ్రి ప్రేమకు స్పందించి, తరుణి దెచ్చి
యిచ్చినాడవు రాజ్యమ్ము నేలనంచు
బ్రహ్మచర్య వ్రతమ్ము చేపడుదునంచు
బలికినాడవు మా ప్రేమ విలువ గనవా!

154. రాజాంతఃపుర కన్యకావళికి నీ రాజ్యమ్ములో భద్రతల్
బూజుల్ వట్టిన బూరుషాధమ బలమ్ముల్ సొమ్ములై నిల్చినన్
సాజమ్మేగద గొంట యిట్టివెతలన్ సాధారణ స్త్రీలు భీ
ష్మా!జాడ్యమ్మిది మానవత్వమునకే మచ్చై ప్రవర్తిల్లెడిన్.

155 ఆడుదానికంటనానంద బాష్పముల్
నిలిచెనేని లక్ష్మి నిలచునచట
దుఃఖబాష్పములకు దొయ్యలి కందోయి
నిలయమైన బీడ కలుగునచట.

156. అని పోటెత్తిన సంద్రమై పలుకునయ్యంబా వచస్త్రీవని
స్వన ఘోషార్భటికిం జలచ్ఛిధిల. నౌ ప్రాయుండు భీష్ముండు, క్ర
మ్మిన దుఃఖాంబువు వెల్లువై వెలికిరా మేల్గామి, గాంభీర్యము
ద్రను మైదాల్చి, పంపె దొయ్యలిని, మర్యాదాకళాలోలుడై

157. అతని చేతనోడితినినప్పుడ నీవతగాని సొత్తువై
యోతరుణీ! మదంతికము నొంటిగ వచ్చితివెట్లు? ధర్మియై
యాతడొసంగు గాక మరియాదయె భూపతి భిక్షగొంట? పొ
మ్మాతనినే వరింపదగునంచు దిరస్కృతి సేసె సాల్వుడున్.

158. ఇంతకంటెను దౌర్భాగ్యమేమి గలదు
రెంటికిని జెడ్డరేవని వంటిదగుచు
మిగుల విలపించి లోలోన బొగులుచుండె
కర్మ పరిపాక మన్యధాకరణ మగునే.

159. నా దుఃఖమ్మునకేరు కారణ మహో నా కన్నవారో! మహా
యోధుండై బలవత్త్రియా సరణిచేనుంకించి మజ్జీవితా
హ్లాదోద్యానము మట్టుపెట్టిన ఘనుండా భీష్ముడో! క్షాత్రమే
యాదర్శంబని పల్కి హస్తిపురి పొమ్మన్నట్టి యా సాళ్వుడో

160. ప్రతికృతి చేయగ వలదే
యతిమాత్ర తపమ్ము చేసి, యద్భుతశక్త్యు
న్నతిగొని, యా భీష్ముని దు
ర్గతి చూడగ వలయునంచు గొంత దలంచెన్.

161. పూనిక దాల్చి, తాపసుల భూమికినేగి, మహాతపః క్రియా
ధ్యాన సమాధి యోగపరతా క్రతుదీక్ష వహించి, తీవ్ర ని
ష్ఠానల పూర్ణ తప్తహుత యౌవనమై మిగులందలంచున
మ్మానిని మౌనిలో కముల మానసముల్ కరిగించె మంచుగాన్.

162. తరుణి దీక్షను జూచి, మాతామహుండు
'హోత్ర వాహన' రాజర్షి యుద్యమించి,
బరశురాముని దౌహిత్రి దురితమింక
మాన్పవేడెను మీరె సమర్థులనుచు

163. పరశురాముని యాజ్ఞపై బయలుదేరి
వచ్చి ప్రణమిల్లినాడు దేవవ్రతుండు
గురుని కన్నుల నుండి కప్పురపు నీరు
వెడలి శిష్యుని మేనెల్ల దడిపివైచె.

164. స్వామీ! త్వత్పద పద్మ సేవన మహాభాష్యమ్ము కంఠస్థమై
యీ మేనెల్ల కృతజ్ఞతాస్థి గతమయ్యెన్, నన్ను శాసింపుమ
య్యా! ముల్లోకములన్ జయించి, తమకై యర్పించుటో నన్మనే
నే మీకర్పణ సేయుటో! పలికి మన్నింపంగదే శిష్యునిన్.

165. అని పల్కిన దేవవ్రత
వినయమునకు సంతసించి, పిలిపించితినం
బను గూర్చి, యామె జీవిత
మున శిశిరమ్మును, వసంతముగ జేయవలెన్.

166. తెచ్చితివి నీవు తమ్మున
కిచ్చుటకై, సాళ్వ విభువరించుట బో
నిచ్చితి వాతడు గాదన
వచ్చినదీయంబ దీని పాణింగొనుమా!

167. అనుజునికై యర్పించెదొ!
వనితను నీవే వరించి, పాలించెదవో
మనమునకెయ్యది రుచియిం
చిననట్లే చేయుమంచు జెప్పెన్ గురుడున్.

168. జామదగ్న్య వాగ్వైఖరీ శస్త్రజాల
దలిత హృదయుండు భీష్ముండు పలుకలేక
తిరిగి తమ్మునికీలేక తరుణి తానె
స్వీకరింపగా లేక నిశ్చేష్టుడయ్యె.

169. మౌనమ్మున కర్థమ్మా
మౌనికి విస్పష్టమయ్యె మఱిగిన యెదతో
మానినికన్యాయము నీ
చేనయ్యెన్ గనుక నీవె చేపట్టవలెన్.

170. రణమును గావింతువా!వీ
రణమును మ్రోగింతువో తలంపుమురా!దా
రుణ యుద్ధ మిష్టమో!తో
రణములు నీ యింటి ముందు రాజిల్లుటయో!

171. అనుచుంబల్కిన జామదగ్ని కనులందాగ్నేయమస్త్రమ్ముతో
చిన, శాంతమ్ముగ జూచు భీష్మ కనులుంజిందించెనో వారుణా
స్త్ర నికాయమ్మనునట్లు తోచినవి. నిశ్వాసమ్ము నాగాస్త్రమ
య్యెనహో తానరనవ్వు గారుడముగ్గానేసెన్ బవిత్రాత్ముడై.

172. ఆ నిశ్శబ్ద మహారణంబున జగమ్మల్లాడె, సప్తార్ణవ
స్వానంబుప్పరమంటెనర్యముని తైక్ష్ణ్యమ్మందైవ్ గుణ్యమున్
ప్రాణి వ్రాతము వ్రేగె, మంచుమలయే వైశ్వానరమ్మయ్యె దా
రానాధుండు చలించె జుక్కలును రాలన్ నేల కంపించగన్.

173. పెల్లుబికిన కోపమ్మున
విల్లంబులనందినట్టి విప్రునిగనుచున్
ముల్లోకములందునగల
మల్లురు కంపించి మూర్ఛ మఱిగిరి తృటిలోన్.

174. గురువులతో సమరము నా
చరితమ్మున మచ్చగాదె, సర్వజ్ఞులు, నా
దురితములు మీకు మాత్రం
బురు కీర్తికరమ్ములగునె యోచింప గదే.

175. దోసమునేమి చేసితిని, తొయ్యలి వేరొకనిన్ వరింపగా
నాసనుగొంట విన్న క్షణమందున బంపితి గాని, యాతడే
రోసము గుర్తు తెచ్చుకొని లోకము నవ్వునటన్న భీతిచే
జేసిన దానికిన్ గురుల చిత్తము నన్నిటు దప్పు వట్టెడున్.

176. అన్యగత చిత్తయగుని
క్కన్యను నా తమ్మునింతిగా జేయుటయా
మన్యు పరిప్రేరిత గురు
మాన్యతకై నాటి బాస మాని మసలుటా.

177. తమ్ముని కై తెచ్చితినీ
కొమ్మను, దన చిత్తమన్య గోరినయది పో
నిమ్మన్నది. పోనిచ్చితి
నిమ్మగువను మఱల తమ్ముడెటు పెండ్లాడున్.

178. బ్రహ్మచర్య వ్రతమ్ము చేబట్టినట్టి
నన్ను బెండ్లాడమనుట యన్యాయమయ్య
కనుక గుర్వాజ్ఞకేని యౌననగలేని
మంద భాగ్యుని శిక్షింపుమా! మహాత్మ.

179. అని ముందు మోకరిలు భీ
ష్మని గని, కోపమ్ము హెచ్చి, శూరుడవని, నే
ననుకొంటి నాదు శిష్యుడు
వినయాచ్ఛాదితుడు పరమ భీరుండగునే

180. ఈ మెఱ మెచ్చు పల్కులు సహింపడు శూరుడు జామదగ్ని నీ
వో మఱి నేనొ! భూమి పయినుండవలెన్ గొనుమాయుధమ్ము, సు
త్రాముని వజ్రమో! త్రిపుర దాహక తీక్ష్ణ పినాకమో! కుజా
స్వామికి నేనొసంగినది వైష్ణవ చాపమొ! యంచు గర్జిలెన్.

181. బ్రాహ్మణుని తోడి పోరు క్షాత్రమ్ము గాదు
గురువు తోడుత పోరు వాకొనగ రాదు
కాని, పరుడు కయ్యమునకు గాలు దువ్వ
వెనుక తీయుట రాజ వంశ్యునకు దగదు.

182. తనకుందప్పని దాట భీష్ముడు మహాత్మా! యాజ్ఞంగైకొంచు, విం
టిని జే బట్టుచునుంటి, మీ సమర పాటిష్ఠ్యమ్ము జూపింపుడీ
అనిదంపూర్వ మహారణంబిది, జయంబా! దైవతాధీనమ
య్యును నే గెల్చిన మీరు గెల్చినను శిష్యుండిందు ధన్యుండగున్.

183. అని వినయమ్ముట్టిపడన్
ధనువందిన భీష్ముడపుడు దారుణ కోపా
గ్నిని దెచ్చిపెట్టుకొని, వె
ల్గిన కందోయి అగ్ని కీలల విసరెన్.•

184. అస్త్రము గురుడేసిన ప్ర
త్యస్త్రము సంధించి, దానినవలం గెంటున్
శస్త్రము గురుడేసిన బ్రతి
శస్త్రమ్మున చట్టు దాని జాడలు దునుమున్.

185. ఇరువది రెండు దినమ్ములు
వరుసగ గతియించె గాని, భయదమ్మగు ద
చ్ఛర వర్ష జాత వైశ్వా
నర చండత క్షణము తగ్గినది లేదయ్యెన్.

186. అపుడు సహనమ్ము డిగ్గి, బ్రహ్మాస్త్ర మంత్ర
పఠన మొనరించినాడు దేవ వ్రతుండు
కడలి కడుపులో గల వేడి సుడులు చుట్టి
పైకినెగ జిమ్మినట్లు విశ్వమ్ము వణకె.

187. నారదుడును, జేజేలును
ధారుణికిం దిగిరి భీష్మ! ధర్మంబటవో
యీ రీతిని గురు శిష్యులు
పోరొనరించుటలు జగతి ముప్పున బడదో.

188. అది యాధర్మికమయ్య ధార్మికుడ! బ్రహ్మాస్త్రోప సంహర్తవై
పది దిక్కుల్ సుఖముండగా మనుపుమా! వారాశులుప్పొంగి, నీ
రద లోకమ్మును దాకి, సర్వజనతా ప్రాణవ్యపాయార్థమై
గదియం బోవకమున్న దారుణ రణోత్కంఠన్ విసర్జింపుమా.

189. అని పల్కన్, బిత్రు దేవతల్ పరశురామా! సర్వ శస్త్రాస్త్ర వి
ద్యనునెవ్వానికి బోధ సేసితివా! నేడా శిష్య సమ్రాట్టుతో
డనె యుద్ధమ్మును జేసి, నీదు భుజ దార్ఢ్యమున్ బ్రదర్శింప జూ
చినచో 'బీజము భూజమున్ దినుటయై' చిత్రమ్ముగా దోచెడిన్.

190. అదియునుంగాక వినుము వస్వంశ వలన
జన్మమొందుట, గంగయే జనని యగుట
జనకు డొసగిన వరము గైకొనుట జేసి
యతడజేయుడు పోరు శ్రేయమ్ముగాదు.

191. నీవు దైవాంశ వలన జన్మించినావు
సాధ్వి రేణుక జనని నీ జనకుడొసగె
భద్ర వరములు, పైని తపస్వివగుట
నతనిబలె నీకు గలదజేయత్వగరిమ.

192. ఇద్దరజేయులు పోరిన
నెద్దరికిన్ రాని విజయమీ విశ్వమ్మున్
బ్రద్దలు చేయుట తథ్యము
పెద్దలు వచియించు పల్కువిన గదటన్నా!

193. అని పల్కాడిన భీష్ముడా క్షణమ బ్రహ్మాస్త్రోప సంహర్తయ
య్యెను వెన్వెంటనె జామదగ్న్యుడు విసర్జించెన్ ధనూరాజమున్
బెను గాలుల్ చెలరేగి యాగినటులో, భీత్యావహమ్మైన యు
ప్పెన యువ్వెత్తున లేచి యాగినటులో విశ్వమ్ము శాంతింపగన్.

194. గురు శిష్యుల పోరాటము
ధరణిని దహియింపబూనె దావానలమై
గురుశిష్యుల పోరాగుట
తరుణీమణి యెదను గాల్చె దావాగ్ని బలెన్.

195. పరశురాముని యంతటి వాడు గూడ
యొజ్జయయ్యును బోరునందోటు వడిన
పెఱలు నిలుతురే యెంతటి వీరులయ్యు
దైవ శక్తియే తగు నాయుధమ్ము గాక

196. అనుచు భావించి యంబమహాగ్రహమున
తీవ్ర తపమాచరింపగా దీక్ష బూని
యబల యనుమాట మఱచి, బాడబము రగులు
కడలి నడచుచున్నట్లుగా కాంత కదలె.

197. ఇంక విచిత్ర వీర్యుడతిహీనము లౌ విషయేచ్ఛలందు ని
శ్శంకగ సంచరించి, తమి చాలమి నిత్యమనంగతా మహా
పంకమనందు గూరుకొని, వజ్రము వంటి శరీరమెల్ల శ
ల్యాంకితమై క్షయార్తుడయి ప్రాణములన్ ద్యజియించె గ్రక్కునన్

198. దాశరాజు నియమ తాత్పర్యమేమాయె?
శాంతనవుని బ్రహ్మచర్యమునకు
నేమి ఫలము? వంశహీనమై కురువంశ
దీప కళిక యందు తేజ ముడిగె.

# త్యాగసింధువు

## IV వంశం

•

199. తల్లి సత్యవతీదేవి తనయు బిలిచి
నడుపమన్నది దేవర న్యాయవృత్తి
బ్రహ్మచర్యమ్ము తనకు సర్వస్వమగుట
మాతృదేవుడు భీష్ముడు మాఱువలికె

200. గతమొక్కమారు గుఱుతున
కతికినదా సత్యవతి మహర్షికి దనకున్
సుతుడుదయించిన తోడనె
చతురుండై తపసి యగుచు సాగుట తోచెన్

201. స్మరియించె గొమరునొకపఱి
నర నిమిషమునందునామెకగుపట్టె బరా
శరసూతి మాతృదేవి
చరణాబ్జములంటుకొనగ సాగిల బడియెన్

202. ఏమి కావలెనమ్మ స్మరించినావు
తల్లి కోర్కె దీర్చుట కంటె దపము గలదె
జనని సంతోషమున కంటె జదువు గలదె
యనుచు వ్యాసుండు మఱి మఱి యంజలించె.

203. సంతోషించినదౌచునా జనని, మస్తమ్మంటి దీవించి, యా
ద్యంతమ్మున్ విషయమ్మ వించె నిజ పౌత్రప్రాప్తి చింతా తప
క్లాంత క్లైబ్యకృదంబుదాకృతినపత్య శ్రేష్ఠమున్, వ్యాసు, దు
ర్ధాంతామోఘ తపః ప్రభావు బరమార్థ ద్రవ్య భండారమున్

204. మనసు గావలె దానికి మధురమయిన
భావముద్దీపనము చేయ వలయు దనువు.
మతిని రంజింపగల యలంకృతులు వలయు
'పారవశ్యమ్ము కంటె శృంగారమున్నే

205. తాపసియగు ద్వైపాయను
రూపమ్మంబికకు మిగుల రోత నొసంగెన్
బాపము కనుగవ మూసిన
యాపెకు జనుషాంధుడగుచునర్భకుడొదవెన్.

206. అటులే యంబాలికయును
గటు రూపమునకు వివర్ణ గాత్రిగ మాఱెన్
గటకట! యవ్విధి కెంతటి
కటికతనము పాండువర్ణగాత్రుడు పుట్టెన్

207. మఱల సత్యవతీదేవి మహితుడైన
పౌత్రునింగోరి యంబికన్ బనిచె గాని
యాపె యోపనిదై దాసినంపెనామె
కొమరు మిగిలెడి జక్కని కొమరునొసగె.

208. తనకున్ ముచ్చట దీర్చెడి
మనుమని గని, సత్యవతికి మది పులకించెన్
తన బిడ్డకు బాలిచ్చుట
కును నోచని దాసి మిగులకుములంజొచ్చెన్.

209. ఆ ముచ్వురకును విద్యా
వ్యామోహము పెంచె భీష్ముడాచార్యుండై
శ్రీమంతులు, బలవంతులు
ధీమంతులుగాగ దీర్చి దిద్దుచునుండెన్.

210. యౌవనావస్థ యంకురమైన వేళ
నాతడా ముప్పురకు వివాహములు చేసె
తాను విడనాడుకొన్న యుద్వాహ విధిని
తమ్ములకు జేసె వారి సంతతికి జేసె

211. ధృతరాష్ట్రుడు జనుషాంధు
డతనికి రాజ్యాధికారమంటక పోయెన్
సుతుడు కనిష్టుడు విదురుం
డతదర్హుడు గాడు క్షేత మన్యం బగుటన్.

212. పాండురాజు రాజ్య పాలనా బద్ధతా
యాగమునకు సోమయాజియయ్యె
బుద్ధిశక్తి యగ్ని, పోకడ మంత్రమ్ము,
ప్రజకు మంచిసేత పరమ ఫలము.

213. దక్షిణదిజ్ నేతృ ధర్మశాస్త్రైక తా
త్పర్యమై జన్మించె ధర్మరాజు
వాయుదైవత మహాబల లక్షణైక ల
క్ష్యుడుమ్ముగా భీముండ జననమొందె
ప్రాచీ రమానాథ బలపరాక్రమ సర్వ
సారమై ప్రభవించె సవ్యసాచి
పరమర్షి దుర్వాస వరశక్తిచే గొంతి
మహితాత్మయును వీరమాతయయ్యె
ఆమెచే మంత్రము పదిష్టమగుట జేసి
తత్సపత్ని మాద్రియు సుతద్వయము గాంచె
నకుల సహదేవ యమళ మానందకరము
నశ్వినీ దేవతా హృదయామృతమ్ము.

214. నీరు పట్టిన మబ్బు నింగిపై చుట్టాడి

యిరువెల్లనిలపైని దొరలు వేళ

మున్నీటి యలలెల్ల బుసకొట్టి పడగెత్తు

పాపతేండ్లై నేల బడెడి వేళ

సర్వం సహాగంధ సారమ్ము నాసికా

పుటములన్ శూలమై పొడుచువేళ

హోమాగ్నిచయజాత ధూమ సంఛన్ననే

త్ర శ్రేణిలో నీరు నిలచువేళ

వాయు మండలమున సుడి పడిన వేళ

అడువులొక పెట్టనెలుగెత్తి యఱచువేళ

తులసి వనమున గంజాయి మొలకలగుచు

ధార్తరాష్ట్రులు నూఱ్గురు ధరణిబడిరి.

215. వానప్రస్థము సౌఖ్యదాయకముగా వ్యాసుండు సూచింపగా

నానందమ్మనుచున్ స్నుషాయుత యరణ్యావాసమున్ జేయ ప్ర

స్థానమ్మున్ బొనరించె సత్యవతి చిత్ సర్వస్వయై, దైవత

ధ్యానైక వ్రతయై చరింపదొడగెన్ వ్యాలోలతాదూరమై.

# త్యాగసింధువు

## V సంగ్రామం

216. ఉఱకలు వేయు దర్పము సుయోధను రూపము దాల్చి పాండవో
ద్ధురుతర సత్య విక్రమ విదూషితమై నిలువెల్ల యీర్ష్యతో
చిఱచిఱలాడుగాని గుణసేవన ధార్మిక జీవనమ్ములో
వఱలు, యశోమయమ్మయిన భాగ్యము నోచదయోగ్యసంగతిన్.

217. ద్రోణాచార్య గురుత్వము
ప్రాణమ్మై పాండుసుతులు వఱలగ, దౌష్ట్య
త్రాణ పరాయణ శీలమె
ప్రాణమ్ముగ నుంద్రు ధార్తరాష్ట్రులు నౌరా!

218. ఒడలెల్లను శాపమ్ములు
గడబిడ గావించునట్టి కర్ణుని చెలిమిన్
సుడిబడు దురహంకారపు
సడికౌరవ్యునకు వ్రణవ సమ్మితమాయెన్.

219. పాండురాజునుసుఱు పంచభూతములందు
కలసిపోయె, జిన్నకాంత మాద్రి
యతని తోడనరిగె హతవిధీ యిసుమంత
కనికరమ్ములేదు కాలమునకు

220. తండ్రిలేక పోయె, ధార్తరాష్ట్ర కుతంత్ర
లీలలకునునంతులేకపోయె
విలువ తగ్గిపోయె భీష్మునాజ్ఞకు గూడ
తాల్మి పాండవులకు గల్మియయ్యె.

221. తమ్ములు పలుకాలించిరి
తమ్ముల సంతునకు గొంత తగ్గెను గానీ
తమ్ముల కొడుకుల కొడుకుల
నమ్మకములు మారె వారి నడతలు మారెన్.

222. బాల్యమునయందె, యాటల పట్టులందె
పాండు పుత్రుల శక్తి సంపదల నెఱిగి
పనిచె నెన్ని కుట్రలు సుయోధనుడు ఖలుడు
భావి రాజ్యమ్ము తనకు లోబడుట కొఱకు

223. ఆశ్చర్యమ్ము సుయోధనాదులు విషాహారమ్ము పెట్టించినన్
దుశ్చర్యన్ బవనాత్మజున్ మడుగునందున్ ద్రోసినన్, బత్నికిన్
నిశ్చేతస్కృత వల్వలూడ్చినను గానీ సుంత స్పందించడా
నిశ్చాంచల్య మనస్వి ధర్మజుడు వానిన్ మ్రొక్కినన్ దీఱునే.

224. ఆ సుయోధనునందు రాజ్యాధికార
కాంక్ష విషవృక్షమై పెరుగంగ జొచ్చె
సకల దోహదమ్ములు సల్పు శకునిమామ
చెట్టు నీడకు కర్ణుడు చేరినాడు.

225. ధర్మమెడ బాసినట్టు సోదరుని విడిచి
విపుల యశమును గాంచె విభీషణుండు
ధర్మ బద్ధులైనట్టి సోదరులకెదురు
నిలిచి రాధేయుడపకీర్తి పులుముకొనియె.

226. వాసుదేవ వాక్యము వేద వాక్యమగుట
ధర్మజాదులు జగతి కాదర్శమయిరి
కర్ణ వాక్యము వేద వాక్యముగ నిలిపి
ధార్తరాష్ట్రులు రాజ్య లోభార్తులయిరి.

227. పాండుపుత్రుల ధర్మ తాత్పర్యమునకు
తనివి నొందునే గాని పితామహుండు
ధార్త రాష్ట్రుల దుష్ట వర్తనము జూచి
నిలువరింపగ జాలమి కలత బడియె.

228. మాయాద్యూతంబాడిరి
త్రోయించిరరణ్యములకు దుష్టాత్మకులై
పాయని ధర్మము వారికి
శ్రేయంబిడ గోరుచుండు చిత్తమునందున్

229. అన్నదమ్ముల పోరు శ్రేయమ్ముగాదు
పదవులందున శాశ్వతత్వమ్ములేదు
ఐకమత్యాయుధమ్ము నూటైదుగురును
బట్టుడని తాత చెవినిల్లుగట్టి చెప్పె.

230. మంచి యుపన్యసించినను మాటికి మాటికి కాదు-కాదు పొ
మ్మంచును ద్రోసిరాజనెడి యర్భకులై, యధికారముద్రకై
పొంచిన నక్కలై, పుడమి మొత్తము భీషణ రుద్రభూమి గా
వించెడి ధూర్తులైనపుడు పెద్దల సుద్దులరణ్యరోదనల్.

231. పదిరెండేడులరణ్య వాసమున తీవ్ర క్లేశమున్ గాంచి, నె
మ్మదినజ్ఞాతము పూర్తి చేసికొని, సామ్రాజ్యమములో గొంత మా
యది యిప్పింమటంచు ధర్మజుడు న్యాయమ్మిందు బల్కాడె, నీ
విది గాదంట యధర్మమే యనుచునెంతే బోధ గావించినన్.

232. ఆ ధుర్యోధను చిత్తభూమికను రవ్వంతేని దాక్షిణ్యమున్
లేదాలోచన లేదు ధర్మ గుణమున్ లేదుండినట్లెక్కడో
యేదో కొంత తళుక్కుమన్నపుడునేవే యుక్తులం బన్ని క
ర్ణాదుల్ చీకటి పూత పూసెదరు దుర్వ్యాసంగమాపాటిదో.

233. మేనమామ శకుని తేనె పూసిన కత్తి
యాశ్రితుండు కర్ణుడల్పబుద్ధి
దురభిమానపరుడు దుశ్శాసనుడు వారు
చెప్పినట్లు చెట్ట చేసినావు.

234. చిన్నప్పుడు నీ చేసిన
వెన్నో తప్పిదములవి క్షమించును లోకం
బన్నా!యీ వయసున విన
కున్నను పాడగుట తథ్యమూకొనగదవే.

235. ఈ సర్వంసహనెందఱో మునుపుతామే శాశ్వతమ్మన్న వి
శ్వాసమ్మున్ మదినిల్పి, యేలుకొని యజ్ఞానాత్తులై, రాజ్య కాం
క్షా సర్వస్వులుగా జెలంగి, తుదకున్ సర్వమ్ము వర్జించి, భూ
మిశుల్ మొత్తము బూదియైనపుడు గంటే వారి నామాంశముల్.

236. సత్య మొక్కటియే గదా శాశ్వతమ్ము
ధర్మమొక్కటియే గదా దైవతమ్ము
కాని పనులేల చేసెదో మానధనుడ!
ధర్మబద్ధుడవై యశోధనుడవగుము.

237. నా యీ జీవము మున్ను తండ్రికయి, మొన్నన్ దమ్ములంగూర్చి, య
ట్లే యాతమ్ముల బిడ్డలం దనుపగాదే నిన్ననీనాడు మీ
కై యర్పించితి, పండబారినది కాయంబెల్ల, నా కంటి ముం
దే యన్యోన్య సమాహతిన్ బడుదురే! యీ వృద్ధు బాధింతురే.

238. మన వంశము దుర్వర్తన
మునకెన్నడు మొగ్గ సూప బోదని, చిత్త
మ్మున నమ్మి బ్రదుకుచుంటిని
మనుమడ! యీ తాత పలుకు మంచిని వినుమా!

239. అని ధుర్యోధను జెంత నిల్పుకొని, జ్ఞానానంద తేజోమయం
బును, వేదార్థ సమాహితంబును, బ్రజామోదాను సంధాయియున్,
ప్రణుతామోఘ యశోభి శోభితము, విద్వల్లోక సమ్మాన్యమున్
వినిచెన్ భీష్మ పితామహుండు యమియై వేమారు కర్తవ్యమున్.

240. అది శరత్కాల పూర్ణిమాస్పద నిశీధి
భీష్మ వాక్చంద్రికా కాంతి వెల్లువగుచు
తత్సుయోధను శ్రోత్రకాంతార సీమ
ముంచి నిలువెల్లనొకమారు ముద్దసేసె.

241. అన్నియు విని, యుద్ధమునకు
సన్నద్ధుండయ్యె ఱేడు సర్వంసహయం
దున్న మహాకర్షణయం
దెన్నియొ జీవితములిట్టులే వృథయయ్యెన్.

242. పలుమారులు సంగరమును
వలదని పలుకాడినట్టి వాడే సైన్యం
బుల నియమించెడి నేతగ
నిలుచుట విధిలీల గాక, నిక్కంబగునే?

243. అన్నదమ్ముల మధ్య పోరాటమేమి?
పరుల తలలెల్ల బంతులై పడుటయేమి?
పట్టెడన్నమ్మునకు రాజుపజ్జ జేర
బాతికేండ్లకే నూఱేండ్లు పండుటేమి?

244. వాని కాళ్ళపై నిలబడవలయుననుచు
వ్రేళ్ళు నాలుగు నోటికి వెడలుననుచు
కత్తి చేబూని సమర రంగమున దూకి
కాలు సేతులు తెగిపోయి కూలుటేమి.

245. ఒక తల్లి కడుపు కోయుచు
ఒక సతి కుంకుమము తుడిచి, యొక బిడ్డడి జీ
వికయే ప్రశ్నార్థముగా
ఒకడొక్కొకడొక్కొకండునుసుఱులు బాయున్.

246. తలను వంచుట యేనాడు తెలియనట్టి
పరమ వీరుల తలలొక పర్వతమ్ము
మడమ త్రిప్పుట యెఱుగని మహితవీర
వరుల కాళులునది యొక్క పర్వతమ్ము

247. గోరువెచ్చని నెత్తుటి కొండవాగు
పొంగి పొరలుచు బ్రవహించి పోవునాడు
బాహులతలేని కేశ శైవలము లేని
కొట్టుకొని పోవా! కాలమున్ దిట్టుకొనుచు.

248. పుడమిపై పుట్టి, పుడమిపై మడియు నరుడు
నడుమ పుడమికై కొట్టుకొనంగ జూచి
పుడమి నవ్వుకొనునొ!జాలి పడునొగాని
కోప పడకుంటయే దాని గొప్పదనము.

249. ఔరా! పాండవ పంచకమ్మచట సప్తాక్షౌహిణీ సేన వి
స్ఫారించన్ ధృతరాష్ట్ర పుత్ర శతమున్ సారించెనేకాదశం
బారాజన్య పరస్పరామిత రణవ్యాలోలతా భీతయై
క్ష్మ్యారోదించి, పరిభ్రమించినది తన్మార్తాండునిన్ జుట్టుచున్.

250. జయమున్ బొందుట దక్కనొండు గలదే స్వప్నమ్మునందేని, ని
శ్చయమున్ జేసిన వెన్కబాటుగలదే సల్లాపమందేనిన
వ్యయ తీవ్రాశుగ కావ్యమాగునె యనధ్యాయమ్మునందేని, తా
తయ చేవింటికి శత్రుసేన పదివేల్ దైనందినాహారమౌ.

251. మొదటి నాడు తాత పదివేల సైన్యమ్ము
సంహరించినాడు సంయుగమున
మరల మట్టుబెట్టె మరునాడు పదివేలు
పాండుసుతుని సేన భండనమున.

252. ధార్తరాష్ట్రసేన తలకు మించినయంత
పాండుసుతుని సేన పరిమితమ్ము
వారి యెడల తాత పరమ ధానుష్కుండు
వీరి యెడల త్రాత విశ్వగురుడు.

253. అమ్మధుహంత బాణ పవనాశన నాశన దక్షదీక్షుడ
శ్వమ్ములమోఘ వేగమున పత్రవిహీన విచిత్రవైనతే
యమ్ములో! దృశ్య వాయువులో!యాపయి తామనణు ప్రమాణ చి
త్రమ్ములో!పార్థసారథి ముదమ్ములరన్ విదిలించె పగ్గముల్.

254. జంభార్యాత్మజు తీవ్రభీకర ధనుష్టంకార మోంకారమై
యంభోజ ప్రవార్చనా భవనమున్ వ్యాపించి, యుద్ధక్రియా
రంభ శ్రీ జయమాలికా సురభిలోల్లాసమ్ము రెట్టింపను
జ్రుంభించెన్ నరుడున్ హరిప్రకటితాశీర్వాద సంపత్తిచేన్.

255. దుర్యోధను సైన్యమునకు
శౌర్యము తగ్గినదా! నరుని శక్తి గనుటతో
ధైర్యమ్మే తగ్గెనొ!ని
ర్వీర్యమ్మై వెన్ను జూపి విడిచినదాజిన్

256. అక్కట! యా సుయోధనునియందనుమానము మొల్కసూపె వే
డెక్కిన కన్నుదోయిని స్రవించిన నెత్తుటి చుక్కలెల్ల తా
మొక్కక ప్రశ్నవేసినవి యూర్జిత శక్తు బితామహున్ యశో
భాక్కును, శత్రుజన పక్షము దాల్చెనటన్న శంకతో

257. పలుకులు తన గుండియలో
ములుకులుగా నాటి క్షాత్రమును శంకింపం
గలవాడవిన్ని నాళ్ళకు
గలిగితివా'నాకు నిటుల కావలసినదే.

258. మునుముందే వచియించినాడ నరునిన్ ముల్లోకముల్ గూడ చి
వ్వను సాధింపగ లేవు, మొండితనమున్ వర్జింపుమాయంచు గ
ర్జుని శౌర్యమ్మును విశ్వసించితివి. నన్నున్ ద్రోసిరాజంటివా
లను గొంపోయిననాడు నీ హితుని వీర్యంబెందులండాగెనో!

259. సరియేలెమ్మ. గతమ్మ సుమ్మ సమరోత్సాహమ్మ సంధించి, యు
ద్ధరుతన్ గార్ముకమందుకొన్నపుడు నాదోశ్శక్తి సైరింప జా
లరు లోకత్రితయమ్మునందు గల వీర క్షాత్ర విద్యాధనుల్
వర సంపన్నుడనౌట జూపెద బ్రతాపమ్మావు వీక్షింపుమా.

260. కానీ యొక్కటి నీమమున్నయది వీకంబోరు వేళన్ ధను
ర్హీనుండార్తుడమంగళ ధ్వజుడు నారీమూర్తియో,నిర్ధ్వజుం
డోనాకంటన్ బడెనేని, వారి పయినేనుంకింపగా బోను నా
నానారాచ మరీచి చాకచకి విన్యాసంబు వర్జించెదన్.

261. అని సుయోధను నమ్మబల్కినది తడవు
భీష్ముడరి భయంకరుడౌచు విసరుచున్న
బాణముల పంక్తి పాండవ వ్రాతమునకు
విడువ నీకుండె నిముసమూపిరిని కూడ.

262. పరమేశుని మెప్పించిన
నరవరుడును, భీష్మ నిశిత నారాచ హతిన్
విరుగం బూచిన మోదుగు
కరణిననిన్ రక్తసిక్తగాత్రుండయ్యెన్.

263. ఆ రూపంబును గాంచి, శౌరియు మహోదగ్రాగ్రహవ్యాపృతిన్
తేరున్డిగ్గి, సుదర్శనాంచిత కరోద్దీప్త ప్రధానాంగుడై
వైరివ్రాత మహీధ్ర గర్వవిచలత్ పత్రావళీ వజ్రియై
కారాకూరము గాగ సేన, నడచెన్ గాంగేయు ఖండింపగన్.

264. హరి పారీంద్రము వచ్చుచున్నయది, గంగాపత్య దంతీంద్ర సం
హరణైకవ్రతనిష్ఠమై యనుచు, సైన్యంబెల్ల కల్లోల సా
గరమై ఘోషమొనర్చె గాని, యచటన్ గాంగేయ గంభీర సా
గరమందున్ జలనమ్ము కన్పడమి దా గైమోడ్చె సుక్షాత్రమే.

265. హరికి నా ప్రాణమవసరమయ్యెనేని
అంతకంటెను వలయు భాగ్యమ్ము గలదె?
యనుచు గాంగేయు కనులు పల్కాడ దొడగె
జేరుకొనునట్టులది గుండె చెవులయందు

266. గుండె లోపల యాదవ కుంజరునకు
గలుగుచుండుట వింతైన గగురుపాటు
క్షణము నిలుచుండెనంతలో సవ్యసాచి
కాళులం బట్టి వాని వెన్కకు మరల్చె.

267. పరమ క్రుద్ధ జిగీషువుల్ సమర శోభాదీప్త గాత్రుల్ పున
శ్శర సంధానము చేయసాగిరి ప్రపంచమ్మెల్లనల్లాడగా
నరుడున్ శాంతనవుండు, దివ్య శరవిన్యాసేక్షణాకాంక్షులై
వరుసల్ కట్టిరి మింట వేల్పులు జయధ్వానమ్ము గావించుచున్.

268. పోరు మొదలిడి తొమ్మిది ప్రొద్దులేగె
నేరినిం గూడ జయలక్ష్మి చేరదాయె
నరుని నైపుణ్యమును శాంతనవుడు మెచ్చు
శాంతనవ శక్తికిన్ సవ్యసాచి తనియు.

269. కాని సుయోధనుండు తమకమ్మున భీష్ముని జేరవచ్చి, నీ
కానరుడే యభేద్యుడగునప్పుడు శస్త్రములన్ దృజింపుమా
ప్రాణ హితుండు కర్ణుడు సమర్థుడు, వీర వరుండు యుద్ధరం
గాన బరిక్రమింప క్షణ కాలము ఛాలునపాండవమ్ముగాన్.

270. ఆహవము నందు నీవుండునంత దనుక
తాను బ్రతిన చేయుట జేసి కాలూనడాయె
కర్ణుడతడున్నచోనర గడియ చాలు
నరుడు గిరుడును యమసదనమ్ము పాలు

271. భండనమున నీకుంగల
పాండితి యొకనాటి మాట వయసుడిగి ధను
ర్దండము వణకెడు వేళన్
జెండాడం గలవె రిపుల జీల్చంగలవే.

272. ముదివగ్గువయిన నిన్నీ
కదనపుటెకిమిని జేయగా దగునే, త
ప్పిదమొప్పుకొనుచునుంటిని
సదనమ్మున జేసికొనుము జపమో తపమో

273. నీవు ధనుస్త్యాగమ్మును
గావించిన తత్క్షణంబ కర్ణుండు రణ
ప్రావీణ్యము చూపించిన
చో విజయశ్రీ వరించు సూనృతమయ్యా.

274. అని పల్కాడిన, దుర్యో
ధన నిష్ఠురములకు దాత తల్లడపడియున్
తన మనము చిక్కబట్టుక
మనుమనితో బల్కె సహన మండితుడగుచున్.

275. నేముదివగ్గునన్న యొక నిష్ఠుర సత్యమెఱుంగ జేయు వా
డీ మహియందు లేమి ధరియించితి సర్వచమూ ప్రభుత్వమున్
నీ మొగమోట వీడి కరుణించి, వచించుట జేసి, సత్యవా
క్యామృత పాయినైతిని గదా జని ధన్యత గాంచె నేటికిన్.

276. ఇన్నినాండ్లు బ్రదికి, యిన్నేండ్లు పైబడి
యింటి మొగము బట్టి యేగుటేల
బ్రదుకు తీపి చేత వదలె మోహరమన్న
చిన్న మాట నాకు జెందనేల.

277. ఒక్క దినము గడువు నొసగుమా! దయతోడ
నెల్లి రణమునందు నేనొ!నరుడొ
కూల వలయు గాక కోదండమేనియు
పోరుపుడమి విడిచిపోదు తనువు.

278. అని పల్కగ విని, దుర్యో
ధనునకునానందమగుట దరలుటతో శాం
తనవునకున్ కర్తవ్యం
బునకాలోచనలు తెరలు పొరలగుచుండెన్.

# త్యాగసింధువు

## VI అంపశయ్య

279. ఆ నిశీధియందునాలోచనల తోడ
గుండె బరువుతోడ గూరుచున్న
పరమ యమిని జూడ వచ్చిరి పాండవు
లండదండ యగు మురారి తోడ.

280. స్వాగతమోయిజనార్దన! నీ పద సన్నిధి నాకు నొసంగితివా
యోగము చెల్లక భోగము చెల్లక యుంటిని నేనిటనొంటరినై
యాగము నాబ్రదుకంతయు దత్ఫల మంతయు నీయది గైకొనుమా
రాగము ద్వేషము దూరము చేసి పరాత్పర! మోక్షమొసంగ గదే

281. చేదురుచుల తోడ జిరకాల జీవినై
పండిపోయి యాసలెండిపోయి
మనుమలెల్ల యుద్ధము గాల్రువ్వుచో
బొగిలిపోతి నిటుల మిగిలిపోతి

282. అన్నదమ్ముల మధ్య కయ్యమ్ములేల
పరుల మధ్యన జుల్కన పడుట యేల
నైకమత్యమ్మునే యడియాససేసి
వంశనాశమ్మునకు నొడంబడగ నేల

283. అనుచు జెవినిల్లు గట్టి నే వినుచునదియు
లెక్కగాకుండె నా పెద్దరికమదేల
తాత బ్రదుకేల మాధవా! యాతనలకు
భరత వాక్యమ్ము పలుకుమా స్వస్తియనుమ!

284. దారల్ పుత్రుల్ లేని నన్ను భవబంధమ్ముల్ పరీరంభ, వి
ద్యారాసిక్యము చూపుచుండుటలు బ్రహ్మాండమ్మునన్ వింత, సా
కే రాజ్యమ్మును లేదు యుద్ధమున నేనే ముందు నారాచముల్
సారింపన్ వలె బెద్ద వింత యిది కృష్ణా! ముక్తునింజేయవే!

285. అనుచు దేవవ్రతుండు కృష్ణునకు మ్రొక్కి
యతిథి సత్కారములును బూజాదికములు
చేసి, ధర్మజాద్యర్చన స్వీకరించి
కుశలమును గూర్చి యడికి వాకొనగ దొడగె.

286. బలముగలవారు, కొండంత బలము మీకు
వాసుదేవుండు సద్ధర్మబలము మిమ్ము
విశ్వజేతల జేయుట వింతగాదు
వ్యాఖ్య నడువడి బ్రదుకు కబ్బమ్మునకును.

287. ధర్మ పక్షపాతమ్ము చిత్తమ్ము నాది
యయ్యు తాతకిచ్చిన మాట యవల ద్రోసి
సత్య భంగమ్ము సేసెడి శక్తి లేక
భండనమునందు నేనటు ప్రక్కనుంటి

288. మంచికో కాక చెడ్డకో మనుమలార!
ధార్తరాష్ట్రుల సేనకాధ్యక్షమిపుడు
జరుపుచుండిన తాత యే సాయమేని
చేయగలవాడె! మీకు వచింపుడయ్య.

289. సమరమ్మందున సాహ్యమెన్నడునునీషణ్మాత్రమున్ జేయ జా
లమి నేదేని వరమ్మునన్యమును గోరన్ వచ్చు. నా ధర్మిక
త్వము మై దాలిచి, శత్రు పక్షమునెడన్ దాక్షిణ్యమున్ జూపి, క్షా
త్రము పౌరుష్యము మట్టుబెట్టగనశక్తమ్మయ్య నాతత్త్వమున్.

290. అష్టవసువుల యంశ నాయందునుంట
గంగ చల్లని చూపు నన్ గాచుచుంట
జనకు వరమున మృతియు స్వచ్ఛందమగుట
నేరికిని గూడ నన్ను జయింపరాదు.

291. శరవిన్యాసము నాకు గ్రీడ సమరోత్సాహమ్ము సంధించి యు
ద్ధురతన్ గార్ముకమందుకొన్నపుడు నాదోశ్శక్తి సైరింప జా
లరులోక త్రితయమ్ము నందు గల వీరక్షాత్ర విద్యాధనుల్
వర సంపన్నుడనౌట జూపిన ప్రతాపమ్మున్ సమీక్షింపుడీ.

292. కానీ యొక్కటి నీమమున్నయది వీకంబోరు వేళన్ ధను
ర్లీనుండార్తుడమంగళ ధ్వజుడొ! యే స్త్రీ మూర్తియో ! నిర్వ్యాజుం
డో నాకంటన్ బడెనేని వారిపయి నేనుంకింపగా బోను నా
నా నారాచ మరీచి చాకచకి విన్యాసంబు వర్జించెదన్.

293. కనుక పాండవులార ! మీ కాంక్షయేమి
యాహవాంగణమందు సాహ్యమ్ము దక్క
నేది గోరిన మీకు నర్పించువాడ
చెప్పగదటయ్య!యేల విచ్చేసినారొ!

294. అనిన దేవవ్రతుని పల్కు లాలకించి
అడుగు కెందామరలు తలకత్తుకొనుచు
నేలనడుగంగ గోర్కె యీడేరెననుచు
వినయ ధనులౌచు పాండవుల్ వెడలినారు

295. చిత్తశాంతిని గృష్ణుడాశీర్వదించి
వీడికోలును గైకొని వెడలినాడు
మరల నేదియో వింత యెంటరి తనమ్ము
గుండెపై తిష్ఠ వేసిన బండయయ్యె.

296. తూరుపు తెల్లవారినది దోషగుణాకర రాత్రి శత్రు సం
హారమొనర్చె భాస్కర కరాశుగపంక్తి స్వకీయ మిత్ర స
త్కారములందుకొన్నయవి తామరసమ్ములు, కైరవాళి బా
ధారుణ నేత్రయయ్యె. సమయమమ్మొకటే ఫలముల్ విభిన్నముల్

297. అది పదియవ దివసమ్మట
కదనమునకు నెవ్వరెటులగానున్నారో
తుది దివసమెవరి దగునో
మొదలి జయమ్మెవరిదగునొ! మోహర మందున్

298. కల్లోలాంబుధియే దరంగముల కెక్కల్ సాచి, మిన్నంటగా
నుల్లాసంబును జూపుచున్న పగిదిన్ యుద్ధావనీరంగమం
దెల్లన్ సైన్యము మోహరించినది భద్రేభాశ్వరాట్స్యందనో
త్ఫుల్లోత్తుంగ తరంగ రింగణ ముహుర్దోః క్రీడనోద్ధర్షమై.

299. నరగాండీవ విముక్త తీవ్రశర విన్యాసేక్షణాకాంక్షియై
సురనాధుండును, భీష్మ ముక్త శర సంక్షుబ్ధావనీదర్శన
త్వరమై గంగయు, మింటిపై నిలువ, భూభృద్వ్రాత విస్ఫోటనాం
బరపాతాంబుధి లోక భూగమనముల్ పాటిల్లినట్లయ్యెడిన్.

300. శరము ముందు శరము శరము వెన్క శరమ్ము
శరము పైని శరము శరము క్రింద
శరము శరము ప్రక్క శరమాయె నా రీతి
శరమయమ్మె యయ్యె సర్వజగము

301. అంతలోన వచ్చెనంబగా మునుబుట్టి
భీష్మ జంపగోరి భీకరముగ
దపము చేసి, శివుని దయను గాంచిన యట్టి
పూరుషుండు గాని పూరుషుండు

302. నరుని చెంత చేరి నారాచములు వేసె
నాశిఖండి జూచి యాక్షణంబ
విడిచె జేతి బిగువు విల్లు నేలకు జారె
నతని తనువు మొత్తమమ్ములయ్యె.

303. గంగయెడద యెల్ల గరగి నీరైపోయె
భాస్కరుండు కడలి వ్రాలిపోయె
నంబరమ్ము శూన్యమైపోయె క్షణములో
నేలకొరిగె తాత సోలిపోయి.

304. శరశయ్యాగతుడయ్యె భీష్ముడు మహౌజశ్శక్తి సంపన్నుడై
ధరణీ భాగము నెల్లనేలగల సద్ధైక జీవుండు, వి
శ్వ రమా భ్రూయుగ మధ్య భాగ తిలక ప్రాయుండు త్యాగవ్రతా
చరణామోఘ యశోవిలాసి, పరమైశ్వర్యార్థ విజ్ఞాతయున్.

305. తన వారికి తత్త్వద్బో
ధనలను గావించి, నరుడు ధాత్రీ గర్భ
మ్మును జీల్చి యిడిన నీర
మ్మును గ్రోలెను జిత్త శాంతి పొందిన వాడై.

306. అసువులను భీష్ముడుత్తరాయణము వఱకు
నెటులో బిగబట్టె నాకాలమేగుదెంచి
పాపనైకాదశీ మహాపర్వమొకటి
స్వాగతము పల్కుచుండ గైవల్యమందె.

307. త్యాగము జేసెను రాజ్యము
త్యాగము గావించినాడు దారసుఖమ్మున్
త్యాగమును జేసె బ్రాణము
త్యాగధనుడు శాంతనవుడు ధార్మికుడతడే

308. శ్యామసుందర! యిది భీష్మ చరితమయ్య!
త్యాగసింధువు కథ సుజాతా కళత్ర!
సరసకవి భోజ! యిది ధర్మ చరితమయ్య!
మంగళము మీకు, సర్వ సుమ్మంగళములు.

•

ఇది కౌండిన్యస గోత్రుండును, కడిమిళ్ళాన్వయ సంజాతుండును, భారతి వేంకటరామయశాస్త్రి దంపతుల పుత్రుండును, భారతీపుత్ర, పండిత రత్నేత్యాది బిరుదాంచితుండును నగు వరప్రసాద ద్విశతావధానిచే, అష్టాదశ దివసమాత్ర నిర్మితంబయిన 'త్యాగసింధువు' కావ్యమ్ము సంపూర్ణము.



# పద్యం

పద్యమ్మునెవడురా ! పాతిపెట్టెదనంచు
ఉన్మాదియై ప్రేలుచున్నవాడు
పద్యమ్మునెవడురా ! ప్రాతపడ్డదియంచు
వెట్టివాడై విఱ్ఱవీగువాడు
పద్యమ్ము ఫలమురా ! పాతిపెట్టిన పెద్ద
వృక్షమై పండ్ల వేవేల నొసగు
పద్యమ్మునెప్పుడో పాతి పెట్టితిమేము
లోకుల హృదయాల లోతులందు

ఇప్పుడద్దాని పెకలింప నెవరితరము
వెలికితీసి, పాతుట యెంతవెట్టితనము
నిన్నటికి మున్ను మొన్ననే కన్ను దెఱచు
బాల్య చాపల్యమునకెంత వదఱు తనము

పద్యస్వీకర్త : **శ్రీ వడ్డి శ్యామసుందరరావు**

పద్య కర్త : **శ్రీ కడిమిళ్ళ వరప్రసాద ద్విశతావధాని**

TECHNICALITIES BY SRI V. BANDA